## 1

అమరావళీస్తోత్ర మానంద గానమ్ము
విమల నాందీ[1] యుక్త విఖ్యాత యోగమ్ము
సంధ్యాప్రయోగ నిస్పందిత జలధరములు[2]
సంధ్యాంతర క్రియా సంచలిత యవనికలు[3]
దిగ్వీధికాగ్రా స్తంభ దివ్య భవనమ్ములో
ఋగ్వేద సంస్తుతీ కృతి[4] విలాసమ్ములో
అర్కేందు తారకోద్యద్ద్యుతి శ్రీలలో
తారొక్కన్న బ్రహ్మాండ ధర్మి[5] నాట్యమ్ములో
దేహి దేహాత్మైక దివ్య తత్త్వమ్ములో
మోహమ్ములన్ వీడి యైహిక ప్రాప్తిలో
నాడెనమ్మా! కృష్ణుడు
పాడెనమ్మా! విష్ణువు

1. నాట్య-నాటకములందు ప్రారంభమున జరిపెడు మంగళము. ఇందు పద ముచేగాని, అర్థముచేగాని, కథాసూచన చేయవలెను. 'ఆశీర్నమస్క్రియావస్తు ర్దేశోవాపి తన్ముఖమ్' అని నాందీ లక్షణం.

2. సంధ్యాకాలములందు చలించుచున్న మేఘములు. 3. రూపకములందు క ప్రయోజనముతో సమన్వయించు కథలకు అవాంతర ప్రయోజన సంబంధం గూర్చునదియే సంధి. ముఖ-ప్రతిముఖ-గర్భ-విమర్శ-నిష్ఠ అను అయిదు భేదము లందు, ప్రదర్శన దృశ్యములందు తెరలుమూయుట తెరచుట. 4. కీర్తన-ప్రబంధము.

5. ఇది రెండు విధాలు. లోకధర్మి - నాట్యధర్మి. లోకధర్మి, లోకవిషయము, స్వభావగతము. స్థాయి వ్యభిచార్యాది భావాలతో నుండునది ఇదిశుద్ధము - వికృ తము అని. లోకప్రసిద్ధ వ్యవహారికమై అంగలీలా విశేషాలు లేక స్వాభావాభి నయముకలదై నానా స్త్రీ పురుషులతోకూడి కేవలం చేష్టలతో సూచింపబడునది. స్వభావ భావోపగతం శుద్ధం తు వికృతం తథా, లోకవార్తా క్రియోపేత మంగలీలా వర్జితం। స్వభావాభినయోపేతం నానా స్త్రీ పురుషాశ్రయం, యదీదృశం భవే న్నాట్యం లోక ధర్మీతు సా స్మృతా॥ - నాట్యధర్మి: 'అతివాక్యక్రియోపేత మతి



సత్త్వాతి భావకం, లీలాంగహారాభినయం నాట్యలక్షణ లక్షితం॥ ఇది కవి కల్పితం . ప్రకృతి చిత్తవృత్తులతో కూడినది. మనోహరమైన అభినయంకలది. నాట్యలక్షణము స్వర, అలంకారములు, అస్వస్థపురుషులు, జనాంతికాదులు ఉపకరణములు, మూర్తిమంతంగా ప్రదర్శించుట, ఒక భూమిక నిర్వహించుచు మరొక భూమిక నిర్వహించుట లలితాంగ విన్యాసము, సముక్షిప్త పద గతిక్రమం, అష్టోపముకొఱకై ఇతిహాసముల నుండి, వేదాలనుండి, బ్రహ్మ చెప్పిన వానిని ఉదహరించుట-రంగపీఠగతమగు కక్ష్యా విధానము కలది.

## 2

సమపాదమును[1] దట్టి చాషగమ్ముగఁ[2] ద్రిప్పి
సమరోద్ధత క్రియా సంధానమునఁ గప్పి
చిఱుగజ్జియలు కాలఁ జంగు చంగున నెగుర
నెఱపింప మల్లల్ల నిగిడి యూఁకుచు నదుర
సమశీర్షమున[3] నిక్కి సాచీ దృగాంచలము[4]
నెమకించి భువనమ్ము నిండించి నిట్టలము[5]
అల దేవకీదేవి వెలయు గర్భమునందు
లలిమీఱ జనియింప లక్ష్య లక్షణమందు

1. ఇది చారీ విధానమునకు జెందినది భూమీచారి - ఆకాశచారి, చారియన వ్యాయామము. భూమిపై పాదచలనము భూమీచారి. పాదములు పైకెత్తి చలనాదికము చూపుట ఆకాశచారి అభినయమునందు హస్తము, గతియందు పాదము ప్రవర్తించుటలో నొకటి ప్రయత్నము - ఒకటి అప్రయత్నమునై ఒండొంటితో కలిసి యేర్పడునది. ఏకపాద ప్రచారము చారి రెండుపాదముల ప్రచారము కరణము. మూడు కరణముల కూడిక ఖండము. మూడు లేక నాల్గు ఖండముల కూడిక మండలము. నృత్తము-చేష్టితము-శస్త్రప్రయోగము - యుద్ధాదులలో చారీ వ్యాప్తి ముఖ్యం. ఇందు సమపాదమున గోళ్ళు సమంగావుంచి రెండుపాదాలు దగ్గరగా చేర్చియుంచుట. స్వభావ రచితో భూమౌ సంస్థానశ్చయో భవేత్, సమపాదః స విజ్ఞేయః స్వభావాభినయాశ్రయః' - భరత శాస్త్రం

2 పాదం తొలుత ఒక తాలము (జానెడు) ముందుకు చాచి తర్వాత రెండు తాలములు దూరముండునట్లు వెనుకకు చాచుట - అట్లే మరోపాదంతో చేయుట.

3 క్రిందికి వంచక, పైకెత్తక నిశ్చలంగా వుంచిన శిరస్సు - 'నిశ్చలం సమమాఖ్యాత మున్నత్యా నతి వర్జితం - నృత్తారంభేజ పాదేచ గర్వే ప్రణయకోపయోః స్తమ్భనే విప్రక్రియాత్వే చ సమశీర్ష ముదాహృతం' - అభి ద

4. ఉన్నచోటినుండి కిడకంటి ఏటకు ఒడ్డంగా చలించు దృష్టి. 'స్వస్థానే తిర్యగాకార మపాఙ్గ చలనక్రిమాత్, సాచీదృష్టి రితి జ్ఞేయా నాట్యశాస్త్రకోవిదైః' - ఇంగితే శ్మశ్రు సంస్పర్శే శర లక్షేంఒకుకే స్మృతా సూచనాయాం చ కులటా నాట్యే సాచీ నిరీక్షణం' - అభి. ద.

5. అధికము.

అభవాది దేవతల కభయమ్ము చూపింప
అభయహస్తముఁ బట్టి యఖిలాండమును బెంప

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

3

అడఁగు పొత్తిళ్ళలో నా యమున దరి దాటి
మునిగి యా యొడిలోన ముచ్చటాడెడు మేటి
వ్రేపల్లె భామకిడ వేడుకల్ చూపునటు
పాఁప పడగలపైని పాపఁడై యొక్కఁడటు
ఫణిరాజు హృదయమ్ము భయమునన్ జలియింప
రణిత నూపురమణీ రమణీయ మలరింప
తక ఝుణత తక ఝుణుత తత్తోంగు తఝ్ఝుణుత
తక ధిమిత తక ధిమితి ధత్తాంగు తఝ్ఝుఁత
స్వర సంశ్రయాత్మక సంయోగ గతి దెలిపి
త్వరితానుగతమునన్ దండపాదము[1] నిలిపి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

6. సర్ప శీర్ష హస్తమున విది సూచింపవలెను. ఇది ఆ యా స్థానములనుబట్టి వభేదం కలుగును. 'పతాక తల నిమ్నత్వా త్సర్పశీర్షకరో భవేత్' పతాక స్తం అరచేయి కొంచెం పల్లంగా వంచవలెను. దీనిని హృదయసమంగా మంచి భయహస్తము సూచింపవలెను. 'చన్దనే భుజగే మందే ప్రోక్షణే పోషణాదిషు' భి. ద.

1. అంచితపాదము (కాలిమెడను భూమిపై నుంచి పాదం అగ్రతలంగా వేళ్ళు ముడిచిన) రెండఁపాదం వెనుకకు జరిపి పాదం కొన భూమికి తగులునట్లుగా గమున క్రిందికి పడవేసిన 'నూపురపాదిక' అను పాదముచే కుంచితపాదముగా

4

జో కమలదళ నేత్ర! జో వృష్ణికుల తిలక!
జో కొట్టి గోపికలు జోలబాడుచుఁ గులుక
అందమగు జోలలో హాయిగాఁ బవళించి
మందయానలఁ జూచి మాయనిద్రను బొంచి
మీలితాంతర నేత్ర మాలత్యముగ నార్చి
లాలించి పాలించు లావణ్యమున్ గూర్చి
వటపత్రశాయియై కుటిలిత పాదాంగుళిన్[2]
గుటకలన్ గ్రుక్కుచును నటియించు సొబగులన్
గుట్టితమ్మున వృత్తకోలమ్ము[3] పైకెత్త
ఘట్టితమ్మునఁ బన్నగాధీశు శిర మొత్త
పాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

5

జగతి కార్యాచరణ సాధనమ్మున వెలయు
జగతి సృష్టికి హిరణ్యగర్భుఁడనఁ దెలియు
సంతోషమూర్తిలో జనార్దన రూపమ్ము
వింత వింతగఁ దోచు వెడలించు రోషమ్ము
రుద్రస్వరూపమై భద్రమై నిత్యమై
ఆదృతమ్ముగ సచ్చిదానంద బ్రహ్మమై
దివ్య తేజమ్ములో దీపించు కిరణమై
నవ్య నిర్మల భావ భవ్యగుణ శరణమై

(వంచిన పాదంగా) రెండవపాదం మెడమమీదనుంచి ముందునకు జరిపి వేగంగా వ్రాల్చవలెను

2. వంకరగా వంచబడిన పాదముయొక్క బొటనవ్రేలు.

8. వంచి గుండ్రముగా త్రిప్పబడిన ఒడితొడల పైభాగము.

ఫణి ఫణామణి ఘృణీ గణోల్బణ కరమ్మున[1]
క్వణిత కంకణ వ్యాకర్షణాకరణమున[2]
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

౫

ఒక వనిత ముదమొప్ప నొత్తి కౌఁగిటఁ గ్రుచ్చి
ఒక వధువు ప్రీతితో నుత్సంగమునఁ జేర్చి
ఒక యువిద తిలకమున్ మొకమునన్ రచియించి
ఒక యబల శిఖదీర్చి యొప్పుగా పింఛమునుంచి
ఒక బోటి కంటఁ గాటుక సొటుగాఁ బెట్టి
ఒక జోటి చెవుల కౌఁనికపుఁ బోగులు గుట్టి
ఒక లేమ ముత్తెంపు ముక్కెరన్ సవరించి
ఒక భామ కంఠాన యుగళహారములుంచి
పక పక నవ్వులన్ బ్రసరించి హర్షింప
ఆకేకరాంతరాలోకనము[3] నర్తింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. ఇది నృత్తహస్తము - చేతులను పైకెత్తి మూపులపై వ్రేళ్ళ నాడించునది - లేక అలపద్మహస్తము కంటికెదురుగా బట్టినచో నది. విశాలములైన కనులను సూచించును. 'తౌ నేత్రదేశగా వ్యల్పణాఖ్యో విఘ్నేశదేవతః। స్తబకేషు కలేషు నేత్రేషు చ నిరూపితః', 2 కంకణ ధ్వనులతో ఆకర్షింపఁబడిన చేష్టలతో. భావం. కరణమన చేష్ట లేక క్రియ. నృత్తమున హస్తపాద సమాయోగమ నేర్పడు క్రియ కరణములు కూడిక అంగహారములకు మూలము. 3. ఓరచూపు కొంచెము ముడుచుకొనఁబడిన రెప్పలను - కనుకన్నులను, అరగన్నులను మాటిమాటికి ప్రక్కకేగు కనుగ్రుడ్లుగల చూపు దూరమున చూచుట, ఆపి ఆపి చూచుటం దుపయోగము. 'ఆకుంచిత పుటాపాంగ సంగతార్థ నిమేషిణీ। ముహుర్వ్యావృత్త తారాచ దృష్టి రాకేకరాస్మృతా' — భరత శాస్త్రము.

## 7

అసువులను వేడిఁబాప నదటునన్ జన్గుడుపు
నసురినిన్ వెసవెస న్నసుదూడ్ప రెట్టింపు
రోసమునఁ జనుపాలు రుచి తెలిసి తాఁగుడువ
ఆసురల్ హర్షించి హరిహరీ యన నిలువ
హస్త విన్యాసము ల్లవఘులింపఁగ వంచి
మస్తకమ్మునఁ జేర్చి మత్తల్లి[1] గతినెంచి
వృత్తమున చరణ మావృత్తమ్ముగ వడిఁద్రిప్పి
గుత్తముగ మెయి వంచి యుత్తానముగ నొప్పి
మత్తహరి శిరము సమ్మర్దమునఁ గ్రుమ్మ
హత్తించి యొత్తి గహ్వరమ్మున విసమూమ్మ
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 8

చిన్నారి బుగ్గలన్ జిగిమిపడు చిఱునవ్వు
చెన్నొందు సిరులకున్ సింగారముల పువ్వు
ఒడిలోనఁ బండుకొను నుత్తానపాదుండు
కడివోవు[2] జగములన్ గరుణించు రెయొడయుండు

1. నూటయెన్మిది కరణములలో నొకటి రెండు పాదములను ఘూర్ణితముఁగను (తిరుగునట్లు), ఉపసర్పితములును (దగ్గరకు జేర్చుటను) చేయుచూ హస్తముఁ పర్యాయములుగా ఉద్వేష్టితములు (చూపుడువ్రేలు మొదలు వరుసగా వ్రేళ్ళను రొమ్ముండి మరలించి బయటికి చాచి) అపవిద్ధములు (కలిపి, పిమ్మట తొలఁగించి) గావింపవలెను. ఇట్లు మరల మరలా చేయుట ఇది మత్తల్లియందుపయోగము 'ఘూర్ణమానస్య పాదస్య యత్రస్యా దుపసర్పణమ్, గుల్ఫస్వస్తిక పర్యంతం తస్మై వామచరః కరః। ఉద్వేష్టితో నితంబః స్యాద్దేశ పాదోపసర్పణే, అపవేష్టిత మాదధ దేవమంగాంతరేణ చ, క్రియైవం బహుళః ప్రోక్తా తన్మత్తల్లి బుధైర్మతే'.న్ర. ర

2. అడఁగు - నశించు.

పైటమాటునఁ దల్లి పాలు గ్రుక్కి క్రీగంట
వాటముగ సర్వమ్ము బాలించు మేటంట
ఊఁగొట్టుచున్ మనము లూఁగించి మేలెంచి
చీ కొట్టి దోషముల్ చిన్మయము చూపించి
అక్కునం దఱచేయి మక్కువన్ జలియింప
అక్కజమ్ముగ నిటు లజాండమ్ము నలరింప

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

9

పొలుపారఁగాఁ బండి బోరగిల్లుచు మెలఁగు
మెలఁగిపాన్పున నడఁగి నలుమూలలన్ మలఁగు
చెలఁగు చెక్కిళ్ళపై గిలిగింత లలరింప
కలకలన్ నవ్వులన్ గలిమి కుప్పలు నింప
ముద్దుగా ముంగాళ్లు మొనసి మోపుచుఁ దాటి
తద్దయున్ బ్రీతితోఁ దప్పటడుగులఁ బారి
వెన్న కడవలు దోఁచి విందు బెట్టుచు దోఁగి
అన్నమిన్నల చెన్ను నాఁచికొను నటు డాఁగి
అంగుగాఁ గోరాడు నాలలేఁగల లీల
చంగు చంగున నెగిరి శైశవోత్సాహముల

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

10

ఆడుచున్ బాడుచున్ అర్భక శ్రేణితో
వేడుకన్ గూడుచున్ విశ్వమ్ము కరుణతో

లీలలన్ భాషించు కేళీవిలాసమ్ము
హేలా వచశ్శీధు లోలాంగ హాసమ్ము[1]
ప్రకట సురరిపు ఘటిత శకట సంఘట్టితము
వికట తాడిత వామవిద్ధపద మండలము[2]
విసదారి పైనుండి విసవిసన్ గుబుసమ్ము
వెసమూడ్చి యసురునన్ బ్రసరింప నస్రమ్ము
చకిత శంకిత దృష్టి[3] సాలోచనము గొనుచు
ప్రకృతమ్ము సకలమ్ము పసికందు పసిగొనుచు
నాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

## 11

సతికి నిచ్చుచుఁ బూర్ణ సదయార్ద్ర హృదయమ్ము
అతివ కొసఁగుచు మందహాసామృత రసమ్ము

1. ఇది స్థాయిభావము. పరులచేష్టల ననుకరించుట, కుహకము (చిన్నపిల్లల చక్కిలిగింతలు లేక మోసము) అసంబద్ధ ప్రలాపము దోషముల నెన్నుట మున్నగు విభావముల వలన హాసము పుట్టును స్మితాదు లిందలి అనుభావములు. హాసమును గూర్చి సాహిత్య దర్పణంలో విశ్వనాధుడు . 'వికృతాకార వాగ్వేష చేష్టాదేన్న ర్తకా ద్భవేత్ హాస్యో హాసః స్థాయి భావః' అన్నాడు. 'వాగంగాది వికార దర్శన జన్మా వికా సాఖ్యోహాసః' అని రసగంగాధరమున జగన్నాధుడు. 2 చారీ విధానము. ఆకాశ గమనముకలది దీనికి వామబంధమనీ పేరు. దక్షిణపాదమున సూచి, వామ పాదమున అపక్రాంత చారిఒ చేసి, దక్షిణ పాదమున దండపాద, వామపాదమున సూచీచారులను. దక్షిణ పాదమున భ్రమరక-పార్శ్వక్రాంతచారులను. వామపాదమున అక్షిప్తచారి చేసి, తర్వాత దక్షిణపాదమున దండపాదము ఊరూద్వృత్తము, వామ పాదమున అలాతచారులను దక్షిణపాదమున పార్శ్వక్రాంత వామపాదమున అతి క్రాంతచారి చేయవలెను 3 ఇది సంచారీ దృష్టి. కనుగ్రుడ్లు చకితములై చూపు కొంచెము చలించి, పిమ్మట స్థిరంగా వుండి కొంత పైకిలేచి తరువాత అడ్డంగా ప్రస రించునది. మూఢమగు చూపు. ఇది శంకయందుపయోగము 'కించి చ్చలా స్థిరా కించి దుద్గతా తిర్యగాయతా, మూఢా చకిత తారాచ శంకితా దృష్టిరిష్యతే'-అభి. ద.

నాతి కిచ్చుచు మహానంద మకరందమ్ము
గోతి కొసంగుచు హెచ్చు కూర్మి మేల్మితనమ్ము
బోటి కిచ్చుచు మవ్వపున్ నవ్వు పూజల్లు
జోటి కొసంగుచు వింత జోడు కూర్పుల జల్లు
కలికి కిచ్చుచు నెమ్మి గ్రమ్ము కమ్మని ముద్దు
చెలికి నొసంగుచు మంచి చెలిమి గూర్చెడు సుద్దు
వెలంది కిచ్చుచు నింకు వేడుకన్ సయ్యాట
లలన కొసంగుచు వలపు తలంపుం దేనియ మాట

లాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

## 12

నీల నీరదకాంతి నెగడు నెమ్మేనితో
నీలకుంతల ఫాల బాలేందు రేఖతో
ఎసంగు మృగమద తిలక మింపుగల మోముతో
మసలు సరసిజకాంతి ప్రసరించు కనులతో
చిఱునవ్వు చిందించు చిన్నారి మోవితో
కొఱలు పాటలన్ మ్రోంగు పిల్లన గ్రోవితో
కటీతట కింకిణీ కలిత నిక్వాణముతో
కటకాముఖ కర[1] కంకణ క్వాణనమ్ముతో

1. కపిత్థ హస్తము నందలి చూపుడువ్రేలు నడిమివ్రేలితో, బొటనవ్రేలితో చేర్చిపట్టినది. 'కపిత్థ తర్జనీ చోర్ధ్వం మిశ్రితాంగుష్ఠ మధ్యమా, కటకాముఖ హస్తో ఉయంకీర్తితో ఖరతాదిభిః' ఇందుకు వినియోగం - 'ధనురాకర్షణే చక్రధారణే వ్యజన గ్రహే' - అభి. ద.



అందందుఁ గ్రందుకొను మందస్వనమ్ముతో
అందమగు నందియల వ్యత్యస్త పదముతో[2]

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

2 ఇది స్వస్తిక పాదభేదం. కుడికాలి పాదము మడమ పై ఉండునట్లుంచి ఎడమకాలి చిటికెనవ్రేలుకడ అడ్డముగా వంచియుంచి నిలుచుట.

## 13

చిలుకల కొలికి వలపు పొలుపు నందెడు వాఁడు
పలుకు పలుకున వలపు కులుకు చిల్కెడు వాఁడు
వేడ్కలన్ వెలయించు వేణుగానము వాఁడు
చూడ్కులన్ హృదయమ్ము చూఱలాడెడు వాఁడు
పెరుఁగు చిల్కెడు కలికి ప్రేముడిన్ గొనువాఁడు
తరివేచి తరుణుల సురులు గొల్చెడు వాఁడు
మెండుగా వెన్నలన్ దిండి గైకొను వాఁడు
పండియున్ బ్రహ్మాండ భావమున్ గనువాఁడు
మన్నుమాటున మెక్కి మాయ చూపెడు వాఁడు
మన్నులోఁ బొర్లాడి మన్నించు మావాఁడు.

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 14

కొండమల్లియ పూలు కొప్పునన్ సవరించు
నిండు జవ్వని చెల్వు నిండార గ్రహియించు
పాల్పితుకు వనితపైఁ బ్రక్కగాఁ బొంచుండి
పాల్పట్టి జుఱ్ఱుచున్ బడఁతి మోమునఁ జిండి[1]
వేళమున వేడిగాఁ బాల మీఁగడ దెచ్చి
బాల నోటను బెట్టి బాధించి మది మెచ్చి
చిలుకు కవ్వము బట్టి కులుకులాడిని ద్రోసి
అలుకు లేకయె వెన్న నతివ మూతికిఁ బూసి
అధికానురాగమున నాల్మగల్ నిద్రింప
అధినాథుఁడ నటించు నట నడుమఁ బవళింప

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. చిండు-చిందు-చిమ్ము

## 15

చెక్కిళుల్ బుణ్కఁగాఁ జేరు కల్కిని బట్టి
అక్కునన్ బొదువుకొని చెక్కిలింతలు బెట్టి
సిగదువ్వి కొడిగట్టు వగలాడి వలపెంచి
అగడునన్ బైకొనుచు నుగపోడుముల ముంచి
తిలకమ్ము దిద్దు నును తీవెఁబోఁడిని నొలసి
అలరు గుబ్బలు గిల్లి యుబ్బురమ్మని తెలిసి
గంధమ్ము బూయు మదగజ గమన నటు రాగ
బంధమ్ము నం దధరపానమ్ము గొని వేగ
మొలనూలు సవరించు ముద్దుగుమ్మను బొంచి
తలిరు పాన్పునఁ జేర్చి తాముద్దు బచరించి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 16

సురసురన్ ముసురుకొను సురగాలి సుడిగట్టి
సరభసమ్మున నింగి సాగుచున్ గిఱివెట్టి
నిబిడాంధకారమ్ము నిఖిలమ్ము గప్పించి
గుబురుకొను పెఁ ధూళి గ్రుక్కించి కుప్పించి
అదటునన్ మొనఁబట్టి యుధము రక్కసు నెత్తి
చదలపై ముడివెట్టి చంక్రమణగతి[1] హత్తి
అగ్గపడఁగా నొగ్గి యంతటన్ దివిజారి
అగ్గలమ్మగు భీతిఁ బ్రాణమ్ము లటు జారి
భూతలమ్మునఁ బడ నుహోత్సవానందమున
వ్రేతలారతులెత్తి వీక్షణ కటాక్షమున
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

1. ఉంకించి-కుప్పించి దూకు విధము.

## 17

ఆడుకొంచును గొల్ల వాడలన్ వెంటాడి
అడుగులో నడుగిడుచు నంతంత నడయాడి
ఒరులెవ్వరున్ గనక నుట్ల పైపై నుండి
వారకన్ నిండారు భాండమ్ములన్ దండి
పాలు మీఁగడ పెరుఁగు పొల్పొందు వెన్నలన్
లోలాత్మక స్ఫూర్తి బాలుఁడై లీలలన్
బోరఁగొట్టుచుఁ బెట్టి నోరఁ గుత్తుచు మెత్తి
జారుగా మైనిండఁ జమిరి శిరమున మొత్తి
ఒక్కనిన్ గికురించి ఒక్కరిన్ మొకిరించి
ఒక్కనిన్ గోకరించి ఒక్కటిన్ యికిలించి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 18

ఓ మగువ! నీ కుఱ్ఱఁ డేమేమొ చేసెఁబో
చీమంత వినిపింప సిగ్గయ్యె మాకుఁబో
ఓ యమ్మ! నీ బిడ్డ మాయింటఁ బాలెల్ల
మాయఁగాఁ గ్రోలి యామాయదా రల్లల్ల
ఓ తల్లి! నీ పాప మాతిరుపులన్ వదలి
మూఁతులన్ బిగఁగట్టి భీతిలన్ బడ పొరలి
ఓ యవ్వ! నీ కొమరుఁ డుత్సాహమున వచ్చి
మా యమ్మినిన్ బట్టి మానమాఱడి వుచ్చి
ఓ చాన! నీకూన యున్మత్తుఁడై కుల్కి
మా చెల్వ మెల్లఁ దా దోఁచుకొందని పల్కి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 19

కొడుకుకై వగపేల? పడంతి! నీ మగండనై
కొడుకు నిచ్చెద రావె కూడెదన్ నీకునై
దధిభాండ మదియేల త్రచ్చెదో నేనుండ
మధురమౌ నవనీత మధరమ్ములో నుండ
గతిలేని బ్రతుకులో సతివ! నిన్నేలంగా
పతియేలకో జగత్పతిని నేనుండంగా
కలిగెనను పొగ రేల? కలంగు వారికి నేన
కలికిరో! కళలంటి[1] కలిసి యుండంగ లేనె
భయమేల? అభయమ్ము భామరో! కొనుమంచు
నయమునన్ జేరరాం బ్రియము గూర్పంగ నెంచు
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

## 20

అల్లరీ పిల్లండా! గొల్ల భామల యిండ్ల
నల్లాడి వెన్నదిని కల్లరీండై రొయిండ్ల
నారాట పెట్టుచున్ జోరాట లవియేల?
ఈ జోటం గట్టితిన్ జోరాదురా, బాల!

1. స్త్రీలకు కళాస్థానములు పదునైదు. కాలి బొటన్రవేలు-అరకాలు-మడమ-కాలు-భగము-బొడ్డు-రొమ్ము-చన్ను-చంక-కంఠము-చెక్కిలి-పెదవి-రెప్ప-నరు-తల శుక్లపక్షమున తల మొదలు ఈ కళలు దిగుచుండును కళలు అరువది ని వాత్స్యాయనుడు 'కళానాం చతుష్షష్టిత్వాత్తాసాంచ సంప్రయోగాంగ త్వాత్కళా సముద్దేశోవా చతుష్షష్టి రితి' - ఆలింగనం - చుంబనం - నఖచ్ఛేద్యం - చ్ఛేద్యం - సంవేశనం - సీత్కృతం - పురుషాయితం - ఔపరిష్టం - అనే ఎని ఒక్కొక్కటి ఎనిమిది విధాలై అరవై నాల్గగునవి. పురుషుడు ఆయా తిథులలో స్థానము తెలిసి స్పృశించి చతుష్షష్టి కళాభేదాలతో స్త్రీని సుఖింపజేయవలెను. సత్సంతాన సౌభాగ్య హేతువు.

అనుతల్లి యుల్లమ్ము ననునయమ్మున ముంప
పెనగొన్న మద్దులన్ బెటిలిపడఁ బెకలింప
ఉలూఖల మట్టెట్టి యుత్సాహమున నీడ్చి
ఆలోకనాంతరాలోల దృక్కులు గూర్చి
నుతియించు వారలన్ గతు లెంతు ననువింత
అతులితానందమున నర్భకుండై యంత
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 21

సిగపైని చిన్నారి చికిలి యీఁకెలు గట్టి
తొగల తూడులు కొన్ని తుంటిపై బిగఁగట్టి
గళము నందున వెండి కంటియల్ మెఱయంగ
వలకాలఁ దామ్రంపు వలయముల్ మ్రోఁగంగ
దండకడియమ్ములన్ మెండుగాఁ దగిలించి
నిండయిన ప్రియముతో నొంగోండ్రు హర్షించి
నిలువెత్తు వేత్రములు నీటుగాఁ గీలించి
చలిది చిక్కము లెత్తు చంకలన్ దగిలించి
ఆలమందలఁ గూడి బాలగోపుల తోడి
లీలమై జతలుండి కోలాటములఁ బాడి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 22

జలజకర్ణిక చుట్టుఁ జెలువొందు రేకులై
అలమి కూర్చుని కుట్టి లలపద్మ హస్తులై[1]

1. దీన్ని అలపల్లవం అంటారు. అన్ని వ్రేళ్ళు విడివిడిగా అరచేతిలోకి వంచ వలెను. దీనికి చలించుచున్న పద్మం అభిధానం. 'ఆవర్తితాః కరతలే యస్యాఙ్గు



కడివెట్టుకొని కుడువఁ గాంక్షించి చల్దులన్
అడిగికొని యూరించి మడిచికొని వ్రేళులన్

గుళోర్ధ్వ భవతిహి, పార్శ్వగత వికీర్ణాశ్చస భవే దలపల్లవః'-'ఇయర్తీత్యరః చలదల కృల్లవా కారత్వా దలపల్లవః' - గతి కలది యరము. చలనుని భావం. ఇది అర్థగించుట - శూన్యవచనములు - మాటిమాటికి తన్ను గూర్చి చెప్పుకొనుట యందు నయుక్తం.

ఊరుగాయలు నంజి యుబ్బు కుడుములు గ్రుక్కి-
మిరియమ్ము రుచి చూచి మేలమాడుచు మెక్కి-
సజ్జంపుఁ గజ్జముల్[2] గుజ్జుపాల్ మీఁగడల్
రజ్జులాడుచు సొజ్జె[3] మజ్జిగ లుజ్జుటల్
అజ్జ[4] లటు నిటు తట్టి బజ్జడిన్[5] గడలుకొని
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 23

గోవులున్ వత్సములు గోరాడనందందుఁ
బ్రోవులై దీవులై పాలుపారఁ బెంపొంద
గోపాల బాలకుల్ గోబృందముల వెన్క-
నూపలన్[1] దిరుగాడి యుత్సాహమ్మున దనక-
హాసియించి యజ్జుం డా బాల గోపాల
మసమంజసమ్ముగా హరియింప నా లీల
విరియించి యన్నన్ని విధములన్ డానొచు
మురిపింపఁ దెలిసి యా పరమేష్ఠి నుతియించు
చానందమున దేవ! అబ్జాక్ష! రక్షించు
మన మందహాసాన మన్నించి పాలించు
చాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

2 ఒకవిధమగు భక్ష్యములు - కజ్జికాయలు 3. బియ్యంవేచి వండిన అన్నం. 4. అడుగు - పాదము 5. ఒకవిధమగు పాదవిన్యాసము. చిందుద్రొక్కుట వంటిది. బహువిచిత్రముతో బజ్జళ్ళద్రొక్కు'-పల్నాటి వీరచరిత్ర. తమిళుల 'శిందు' నృత్యమే; ఇది. తెలుగువారు జాతరలు మున్నగు పుత్సవాదులలో నిది ప్రదర్శింపుట నేటికిని తెలియవగును.

1. చిన్న చెట్లుగల అడవి - చిట్టడవి - ఊప.

## 24

నెచ్చెలీ! రమ్మిటుల నికుంజ కుజములందు
ముచ్చటగ గోటికొమ్మచ్చు లాడఁగ నిందు
నేస్తమా! తెమ్మిటులఁ గుస్తరించిన పూలు
విస్తరించిన మాధవీ మల్లికా లతలు
చలికాడ! చేపట్టి చేకొనుము విరిచెండ్లు
బలికొట్టి[2] గుంపట్టి[3] బలిమితో బలిగుండ్లు[4]
మిత్రమా! తే లెమ్ము మేలైన తాడితక[5]
సూత్రమ్ము వితతాజేఁగి సొంపు క్రీడింప నీక
అప్పుఁడా! కసరమ్ము యందందుఁ దారాడి
ప్రాప్తమ్ము నాలోన గుప్తమని మాటాడి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

2. ఒకడు పలికిన మాటకు (శబ్దానికి) మారుగా నదేవిధమున వేరొకడు మాటలాడుట (శబ్దం చేయుట) ఇందు పరస్పరము శబ్దస్వరము అందు సామ్య ముండును.

3. ఊపిరిపట్టు శ్వాస నొక్కసారిగా గూర్చుకొనక మెల్లగా గూర్చుకొనుట. 'గుంపట్టు' అంటారు. ఊపిరి బిగపట్టు - శ్వాస నొక్కసారిగా పీల్చి బిగపట్టుట 'దంపట్టు' అంటారు. గుంపట్టు-దంపట్టు-అనే పదాలు మాండలికాలు, జాతీయాలు. ప్రయోగాలు మృగ్యం.

4. ఇది బాలక్రీడ ఊపిరి బిగపట్టి కూయుచు - 'బల్' అని కూయుచు నొక్కచో మంచిన కొన్ని గుండ్లను (వస్తువులను) మోసికొనివచ్చి నియమిత స్థానమున నూపిరి విడుచులోపల నన్నింటిని చేర్చవలెను చేర్చలేనివాడు ఓడిపోవును.

5. దీన్నే 'అంగుళీతాడితకం అన్నాడు వాత్స్యాయనుడు పిల్లలు గుంపుగా చేరి ఒకరిని దొంగగా నియమించి, వానిని కళ్ళు మూసికోమని చెప్తారు కళ్ళుమూసికొన్న వాని ముక్కును ఒక్కొక్కరు వ్రేలితో తాకి నాపేరేమి? కనుక్కోమంటారు. వాడు కనుక్కోవాలి.

## 25

ఆకర్షక క్రీడ[1] నలరించు నొకచోట
ఏకపాదిక[2] లాడ నెక్కించు నొకచోట
ముష్టికాద్యూతమ్ము[3] మొనయించు నొకచోట
అష్టబంధక[4] రీతి నాడించు నొకచోట
ఆరబ్ధిక[5] ప్రకారాంతర మ్మొకచోట
ఆరభటుండై[6] నారి సాగించు నొకచోట
యుద్ధకేళీక్రమ నిబద్ధుండౌ నొకచోట
ఉద్ధతుండై సకల మూహించు నొకచోట
ఆలతో బృందావనాంతమున నొకచోట
నలువొప్పం డా సదానందమున నొకచోట
నాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

1. ఇది బాలక్రీడ పిల్లలు రెండు జట్లుగా చీట్లు వేసికొని ఒకరు రెండ కొనలు రెండుజట్లుగా పట్టుకొని లాగడం. 2. ఇది బాలక్రీడ_ఒంటి కాలితో కుందడం ఒక వలయంగీచి కొందరు బాలబాలికలందు చేరగా, ఒకడు కుందుచూ తక్కి_న వారిని తాకడం_మరియు నిది దేశి స్థానకములలో నొకటి సమస్థితిలోనున్న ఒక కాలిమోకాలి వెలిప్రక్క_, రెండోకాలు ముడిచిన మోకాలు వెలిప్రక్క చేరుట. 'సమస్థితస్య పాదస్య జానునో బాహ్యపార్శ్వతః అన్యస్తు బాహ్య పార్శ్వేన సంలగ్నో జాను కుంచితః, స్థానకం యత్రతత్ తదజ్ఞై రేకపాద ముదీరితమ్'_నృ.ర ఎక్కించు=ప్రేరేపించు. 3. ఇది ముష్టిద్యూతమనవచ్చు _ ఒకరు కొన్ని రాళ్ళుగాని వుండలు (గోళీ_) గాని పిడికిలితో పట్టుకొని పైన గుడ్డ కప్పుకొని పిడికిలిలోని వెన్ని? అని ప్రశ్నించడం_ ఎదటివారు చెప్పడం. 4 ఇది బాలక్రీడ_ఎనిమిది దిక్కు_లందు ఎనిమిదిమంది బాలురుగాని బాలికలుగాని వుండి ఒకరు మధ్యలో వుండాలి. దిక్కు_ల స్థానాల్లో వున్నవారు తమ స్థానాలు వదలి మరొకరి స్థానం చేరాలి _ ఇలా వారు వదలిన స్థానాన్ని గమనిస్తూ నడుమనుండువారు తటాలున ఖాళీస్థానం ఆక్ర మించుకోవాలి. దానికై వచ్చినవాడు చోటులేక నడుమచేరి తా నావిధం చేయాలి దీన్నే కంబాలాట_ఉప్పమ్మ! ఉప్పో!_అని నేడంటారు. 5. ఇది దాగుడుమూతలాట 6. పెక్కు_ విలుకాండ్రతో పోరు యోధుడు. ధైర్యము గలవాడు.

## 26

మునిచంద్ర పాదాంక ముద్రికా తీరమ్ము
వనజావలీ భ్రమిత బంభరీ ఝంకృతము
గోపికా కుచకుంభ కుంకుమాంకిత వారిఁ
గెంపారు భంగాగ్ర జంబాల కచపాళి
గోపాల సంభవిత పాపాపనోదాంగ
శ్రీపాద సంశ్రయిత సిద్ధసైకతలింగ
గోబృంద పానామృతాదృతీ సలిలముల
సంభృతాత్మైకమతి సంచారగతి లీల
బాలా వినోద సంభావితాశ్రయ పులిన
బాలానురాగార్ద్రి భావాతిశయ యమున
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 27

అంతర్గతాహి గరళాగ్ని కీలాకులము
సంతతాక్రందనా చక్రకుల సంకులము
ఉద్ఘాత ఫూత్కృత సముద్ధూత ధూమాభ్ర
ముద్వేష్టితభ్రాంత ముద్ధృతి జలారంభ
మాపాంత తృణలతాజ్ఞాహాత జ్వలనమ్ము
విపదాశ్రయ గభీర విశ్రుత వ్యావృతము
విషధరాక్రమిత దుర్విష జీవ జీవమ్ము
దోష దుర్వహా మహా దుఃఖ సంభృత హ్రదము
వీక్షించి విశ్వసంరక్షణ క్రియ నెంచి
వృక్షశాఖారోహ దక్షతఁ బ్రకటించి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా విష్ణువు.

## 28

అలయమున దరి దరిని యాలమందలు గూడ
అలబలము చేయు నాబాలవృద్ధము సూడ
నందదంపతుల మది కొందలింపఁగఁ జేయ
మందయానల హృదయ మందారములు పూయ
మానిబృందమ్ములు నమస్కార మొనరింప
వనదేవతలు మ్రొక్కి భక్తితోఁ బ్రార్థింప
అమరసంఘమ్ము లాహాకారములు నింప
విమల పుష్పౌఘమ్ము విన్వీధి వర్షింప
బ్రహ్మాండ భాండమ్ము భ్రమియించు గతి దోప
బ్రహ్మమ్ము దానయ్యె పరమాత్మ విధిఁ జూప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 29

శిఖిపింఛ మొకయింత సిగపైని జవ్వాడ
ముఖముపై మూఁగుచును ముంగురులు చెఱలాడ
ముక్కు ముత్తెము ముద్దు ముద్దుగా నటియింప
చెక్కులను జెవిపోఁగు చిఱువెల్గు చిలికింప
గుత్తంపుఁ దామెతులు గుత్తులుగ దిగజార
ముత్తెంపు సరములును ముప్పేటలై చేర
మొలత్రాటి గజ్జియలు ముచ్చటను మ్రోఁగంగ
కాలి యందియలలో ఘుల్లులలు వెలయంగ
మేని సొబగులు నీలి మేఘాలు బింబింప
కనకాంబరము లోనఁ గాంతి మాలలు నింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

**30**

పరవళ్ళు ద్రొక్కుచును బయనించు యమునలో
ఉరుల తరార్భటులతో నుసిగొన్న యలలలో
నింగిపై కసిగొంచు నెగయు తుంపురులలో
బ్రుంగి ముడివడు సుడులఁ బొంగారు నురుగులో
ధిర ధిమిత శబ్దమ్ము దిక్కులీనఁగఁ దాఁచి
తీరమ్ము వడివడిగఁ దూఁటు కెరటము లూఁచి
పరువు పెట్టెడు జలప్రాణులను బాలింప
ఉరగోగ్ర దుర్విషాగ్ను వ్యథలని మాయింప
హాసరోచిస్సులు ముఖారవిందము నింప
వెసలెల్లఁ బ్రసరించి దివ్యదీప్తులు ముంప

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

**31**

పట్టి వేణువు నూది పలికించి పసిగట్టి
పట్టుదట్టీలోనఁ బదిలమ్ముగాఁ బెట్టి
తోసి కట్టిన కొండె దునిసి యాడఁగ నూఁచి
కాసెకట్టు బిగించి ఖండువా నెగఁద్రోచి
నిక్కించి మొగమెత్తి నీల్గి జబ్బలు దట్టి
చక్కఁగా వీక్షించి చాఁచి చేతులు వట్టి
ఎగు భుజమ్ముల నెత్తి యెదురు ఱొమ్మును విప్పి
దిగు పాదముల నూని తిరుగు పట్టుల నొప్పి
ఉప్పరమ్మున కెగయు నూరువుల దట్టించి
కుప్పించి దూకంగఁ గుఁచించి మెయివంచి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

32

మడుగులో సుడియలలు మాటిమాటికి వెడల
వెడలు బుద్బుదపంక్తి ఫేనమ్ముగాఁ గదల
ధింధిమి ధ్వనులకు నదీగర్భములు బ్రుంగ
బంధురచ్ఛన్న శైవాలమ్ము లుప్పొంగ
పద్మినీ షండములు పరిభ్రమమున మునుఁగ
సద్మభాగమ్మెల్ల[1] ఝుఝ్ఝరస్వన మెసఁగ
పాతాళ తలము జంగాల జాలము వొంగ
భూతలమ్మున మహాభూధరమ్ములు గ్రుంగ
కర పల్లవమ్ములను గ్రమ్మ జలములు చీల్చి
అరకాలు విదలించి యావర్తమ్ములు[2] పేల్చి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

33

హరినీలముల భాతి నలలలోఁ గాన్పింప
నీరములఁ బచ్చరాల్ నెరపినటు తోఁపింప
అలకలల్లనఁ బైకి యూర్ధ్వమ్ములై నిక్క
జలతలమ్మున సముజ్జ్వల నీలరుచు లెక్క
పీతాంబర చ్ఛాయ పెల్లుబుకు జల్లులో
ప్రతిబింబితమ్ములౌ భర్మరేఖాళిలో
అరవిందముల మాఁగు నళి రుతమ్ములు మీఱ
అఱిముఱిగి బెగ్గురులు నడలి దిగ్గునఁ జార
బుడు బుడుంగని మున్గి మూర్ధమ్ములోఁ గ్రుమ్మి
కడువడిగ నెమకఁ దాఁ గనుదమ్ములను జిమ్మి

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. నీరుగల ప్రదేశమంతయు 2. నీటి సుళ్ళు.

34

బడబాగ్ని భుగభుగ ల్భగ్గుమని జృంభింప
కడలెల్ల గడగడ న్గదలి చి యూఁగింప
పాతాళ జల మహాప్రళయమ్ము గల్పింప
అతి ప్రకంపిత హృదయగతిఁ గోడఁ జరియింప
లేలిహానము[1] లెల్ల వేల్లితమ్ముగ దొరల
జలచరమ్ములు పంకచక్రమ్ములోఁ బొరల
అవతీర్ణ సలిలోద్ధృతాగ్నులును వెన్నాడ
ఆవేగమున మహావ్యాళమ్ము లల్లాడ
నాగతరుణీమణీ నర్మహాసము లాడ
బిగియారు కౌఁగిళ్ళఁ బ్రేమపాశము లూడ
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

35

మణిరచిత వల్మీక మందిరాంతరములో
ఫణి ఫణామణిఘృణుల భావాంబరమ్ములో
చిల్వ చెలువల చిలిపి చిఱునవ్వు దొంతరల
చెల్వంపు నునుసిగ్గు సిరి వలపులను తెరల
అరుసించు విసదారి యనురాగ మహిమాన
మురిసిపడు ప్రియురాలి మోవి తేనియలాన
గమకించు కాళీయ క్రమముఖములు దూసి
భ్రమ గప్పి పరువిడెడు రాజీవమును[2] గోసి
ఫణిరాజు కటిలోగ్ర బాహువులు విదలింప
రణగుణ ధ్వనిచేయు ప్రళయమ్ము వీక్షింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. పాము. 2. చేప.

36

వెడకన్నులను గోప విస్ఫులింగము లుమిసి
పుడమి పొరలాడఁగా ఫూత్కారములు చేసి
ఊఁగి పడగలు విచ్చి యుద్రేకమును గుప్పి
నాగలోకము నేర్చి సాగు సెగలను గప్పి
భుజసహస్రము నెత్తి పుచ్ఛమ్ము పైకెత్తి
త్రిజగమ్ములను మొత్తి తీవ్రముగ నీరొత్తి
పరిపంథి నెదిరింపఁ బటు పరాక్రమముతో
పరుగు వెట్టి యదల్చు గరువంపుఁ దనముతో
మెయిచుట్టి యురమొడ్డి మిన్నుగొట్టిన యటుల
రయమున న్దాఁకె నహి రౌద్రమున హోరి నటుల
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

37

డికిలిని ముడివేసి విచ్చు బొమ్మను గ్రుమ్మ
డగాలి వడివలెను సుడిగొనుచు బుసలుమ్మ
పధరము కోపాన విషరసము బ్రసరింప
ష నేత్రాలలో రూక్షాగ్ని వెడలింప
న్నాగు మిడిసిపడి వెన్నడచి యొడిముట్టి
న్నంటు పడగెత్తి మిట్టించి మెయిచుట్టి
జెట్టినిం బట్టి మగటిమిం జేకూర్చి
నెంచి సత్తువం బ్రోఁకుచును విప్పార్చి
గొమ్ము వక్రింప ధీరతను దీంద్రించు
రాజు నదలించి యట్టహాసము నించు
చూడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 38

బుడబుడల శబ్దములు పుడమిపై కెగఁ బ్రాఁక
తొడితొడిగఁ గడలెల్లఁ గడల కడలను దాఁక
చొప్పించి వలకేల గుప్పిటను మెడనొత్తి
కుప్పగా గుదిగ్రుచ్చి ఖోలకమ్మున[1] హత్తి
వాలాగ్రమును బట్టి వలయితమ్ముగఁ ద్రిప్పి
పలుమారు పడగలను వంచి సీరము గుప్పి
చిమ్మెడు విషాగ్నిలోఁ జిటపటలు చెలరేఁగ
క్రమ్ముపొగ లజ్జడఁచు కమలగర్భము లూఁగ
కాళిందిలో మహా కాలాహిఁ దాఁబట్టి
గళభాగములు నొవ్వఁ గ్రక్కునఁ దాఁగొట్టి

* ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 39

సవ్యపాదము[2] మెట్టి యవలగ్నమునఁ[3] బట్టి
అవ్యథము[4] నిగుడించి యార్భటించుచుఁ జుట్టి
చతురంగ రీతిలోఁ[5] జక్కియలు వగులంగ
గతుల చలనమ్ములో గండమ్ము లదరంగ
బంధ బంధమ్ములను బ్రాణమ్ము వొక్కంగ
గంధ ద్విరసనమ్ము[6] గరళమ్ము గ్రక్కంగ
నట్టిట్టుఁ గదలంగ నాధారమును[7] గ్రుమ్మ
నిట్టూర్పు సెగలెల్ల బిట్టునను బైఁ గ్రమ్మ *

1. పుట్టయందు 2 కుడిపాదము - 'ఎడమ' అనియు 3. నడుముసందు ము 5. ఇది మల్ల బంధములలో నొకటి - కుస్తీపట్టు. ఉర్దు భాషలో 'షత్' అంటారు 6. పాము 7. గుదస్థానం (పృష్ఠభాగం).

విక్రమ క్రమమునన్ విక్రీడితమ్ముగా[8]
చక్రమ్మువలెఁ దిరిగి సాఁగి చిక్కింపఁగా[9]
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 40

బుసబుసలు రుసరుసల బుద్బుదమ్ములు వెడల
మిసమిసలు విసవిసను మెఱుఁగు లీనుచుఁ గదల
జలములను జలమునను సాగించు సమరాన
జలశాయి నడగట్టు నలనాగబంధాన
చిక్కి చిక్కని యటులఁ జెలఁగి దేహమునుండి
చొక్కుచూన్ బరమాత్మ చొప్పు నమరఁగనుండి
మాయావరణమునన్ మడఁగు పిండము భాతి
నాయమున మధ్యమున నడఁగు బిందువు రీతి
పడియుండి గతినెఱిఁగి పట్టు గుట్టులు డొల్ల
గుడుసువడి[10] సప్పమ్ము గుండె గుల్లగ డుల్ల
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 41

గంధగజమది లతాబంధమ్ము ద్రెంచినటు
సంధిబంధములూడ బంధమ్ము ద్రుంచెనటు
కాలోరగమ్ము నా కంఠముగఁ దాఁ జుట్టి
వాలమ్ము చేపట్టి వాడితలమున నట్టి
మొగిచి మూలము ముంచి మూర్ధమ్ము మొగ్గించి
ఎగసి దుందుడుకుగా నెడసొచ్చి లగ్గించి

8 మిక్కిలి చలింపబడుటవల్ల 9. కట్టబడగా 10. గుండ్రముగనై

49

పది పడగలను బట్టి పాదమ్ము పైఁబెట్టి
పదిలమ్ముగాఁ దట్టి పట్టు విడుపుల ముట్టి[1]
జిహ్వాగ్రములు బట్టి చీల్చి వాగెలుదీర్ప
జిహ్మగా పళు[2] లడలి జీవమ్ములను బార్ప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

42

రవణ[3] భూ భవనమ్ము రంగస్థలము గాగ
నవమేఘమాలికలు యవనికావళి గాగ
ద్యుమణీందుమండల ద్యుతులు దివియలు గాగ
విమలాబ్ధి ఘోషమ్ము వివిధ వాద్యము గాగ
బెళఁకు పవనమ్ము మృదువేణుస్వనము గాగ
తళుకుఁ జుక్కలు వింత తారహారము గాగ
ఆ ప్రకృతి యాకృతుల్ ఆహార్యములు గాగ
ఆ ప్రాణి సంఘమ్ము లాప్రేక్షకులు గాగ
విశ్వమ్ములోఁ దాను విశ్వరూపము గాగ
విశ్వమ్ము తనలోన విశ్వాత్మయును గాగ
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

43

కాళీయ ఫణి ఫణాగ్ర మణిమండపములో
జలతరంగ మృదంగ శబ్దాంగ గతులలో

1. త్రొక్కి 2. పాముల గుంపులు 3 అందమైన 4. భూషణాది
గి.

చంచత్పుటత్తాళ సంగతా సారితము[1]
ప్రాంచ న్నదీతట ప్రత్యంగ వాద్యమ్ము
పంకజావాసిత భ్రమర ఝంకారమ్ము
సంకుల విపంచికా స్వర సమారోహమ్ము
వారిపీడన గళిత వాయు సంచారమ్ము
సారించు సుషిర[2] నిస్వన రస ప్రసరమ్ము

1. చంచత్పుట-చాచపుట-షట్పితాపుత్రక-సంపక్వేష్టాక-ఉద్ఘట్ట-మనే ఐదు తాళభేదాలలో నిది తొలిది ఇది తాళక్రియవల్ల (పాతము) మూడు విధాలు. సన్నిపాత, శమ్య, తాళమనే క్రియచే సన్నిపాతాది యనబడును శమ్య-తాళ-శమ్య సన్నిపాతలనే క్రియచే శమ్యాది యనబడును సన్నిపాతాది చంచత్పుట తాళము నాట్యమునందు, శమ్యాది చంచత్పుట తాళం ఆసారితములందు, తాళాది చంచత్పుట తాళం పాణికాదులందు ప్రయుక్తము. చంచత్పుటము చతురశ్రజాతికి-చాచాపుటము త్ర్యశ్రజాతికి చెందినది. చంచత్పుటమునకు మొదట రెండు గురువులు, మూడవది లఘువు, నాల్గవది ప్లుతము. చంచత్పుట తాళముయొక్క సంయోగములచే వ్యాపింప జేయబడిన ఆసారితములు కలది అని వాక్యభావం ఆసారితమునందు-ముఖ-ప్రతిముఖ దేహ-సంహరణ-అనే నాలుగు అంగాలు కలవు 2 పిల్లనగ్రోవి. 3. రూపకము ప్రయోగించుటకు ముందే ప్రయుక్తమగునది. నాందీత్యాదులు వీణ, మృదంగాది-వాద్యాలతో ప్రసంగాదులతో. ప్రత్యాహార, అవతరణ, ఆరంభ, ఆశ్రావణ, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘోటన, మార్గాసారితములనే విధాలతో వీనిని తెరలోపల వాద్యయుక్తముగా నాచరింపవలెను. 4 అంగములు శరీర సంబంధములైనవి, నాదసంబంధమైనవి రెండు - శరీర సంబంధమైనవి (1) అంగ (శిర, హస్త, కటి, ఉర, పార్శ్వములు) (2) ఉపాంగ (నేత్ర, భ్రూ, నాసిక, అధర, కపోల, చిబుకములు, (3) ప్రత్యంగ (స్కంధ, బాహు, పృష్ఠ, ఉదర, ఊరు, జంఘలు)-నాద సంబంధివి - (1) అర్పణ (నాదముయొక్క వృద్ధి) (2) విసర్గ (నాదముయొక్క తగ్గింపు) (3) విచ్ఛేద (నాదముయొక్క అభావస్థితి) (4) అనుబంధ (నాదముయొక్క భావస్థితి) (5) దీపన (నాదముయొక్క ఆరోహణ) (6) ప్రశమన (నాదముయొక్క అవరోహణ)

## 51

పూర్వరంగము[3] నం దపూర్వమ్ముగా నొప్ప
పర్వమహా సంగములఁ[4] బ్రత్యాహార మొప్ప[5]

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 44

రంగాభిముఖ కుతప రంగమ్ము[6] రవళించి
సాంగ వాద్యోద్ధృతము సాగించి యుపమించి
సంపూర్ణ సంచార షాడవము[7] సారించి
సంపాద్య మూర్ఛనల[8] షడ్జమము[9] నలరించి

5. కుతప విన్యాసము వాదకులు తమ వాద్యములను చేర్చి ప్రయోగించుట. వీనిని యంతర్యవనికాంగము లంటారు. ప్రత్యాహారమును పూర్వరంగము నందే ఆచరింపవలెను. పర్వమున నుత్సాహము. ఉత్సాహకరమైన శరీర, నాదసంబంధము లగు వానితో పూర్వరంగమున కార్యకలాపము చేయబడినదని భావము.

6. కుతప విన్యాసము - రంగస్థలమున కెదురుగా (ప్రాఙ్ముఖముగ) మార్దంగిక పాణవిక - దార్దురిక - గాయక - గాయికా - వాంశిక - వైణికులు తమ తమ వాద్యాలతో నుండి వానిని శాస్త్రవిధిని ప్రయోగించుట. 7. స్వరమూర్ఛనల యందలి సంచార స్థితిలో షాడవమున సప్తస్వరములలో నొక స్వరము లోపించి ఆరుస్వరాలే యుండుట ఔడవితంలో రెండు స్వరాలే లోపించియుండుట. వీని నిట్లే ప్రస్తరించుకోవలెను. 8 వరుసగా సప్తస్వరాలను ఆరోహణ అవరోహణములతో షడ్జ మధ్యమ గ్రామములందు పలికించుట. 9 సప్తస్వరాలలో తొలిది. 'స' స్వరం - నాసిక - కంఠము - ఉరస్సు - తాలువు - జిహ్వ - దంతము - అను ఆరు స్థానముల నుండి పుట్టినది కాన షడ్జమము. 'నాసా కంఠ మురస్తాలు జిహ్వా దంతాంశ్చ సంస్పృశం షడ్జ సంజాయతే యస్మాత్తస్మాత్షడ్జ ఇతి స్మృతః' - ఋషభమునుండి ఆరు స్వరాలు దీనివల్లనే పుట్టును.

తాన[1] మానము లెల్ల స్థానమ్ములం దుంచి
మానుగాఁ దాళము[2] లయా[3]నుబద్ధము నెంచి
జాత్యంశ గతి[4] గూర్చి స్వరకల్పనల్ బంచి
ప్రత్యంశమున్[5] రసాభ్యంచితము[6] సవరించి
వర్ణా[7] లంకార[8] భావాశ్రయము నెంచి
కర్ణపేయమ్ముగా గానమ్ము గావించి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 45

తక తకిట త త్తకిట తకతకిట త త్తకిట
తక ఝరిత ఝుంతకిట తకఝుంత ఝుంతకిట
తద్ధిమిత ధింధింత తద్ధిమిత ధింధింత
తద్ధింత ధిమిధిమిత తద్ధిత్త తాంధింత

1. విస్తరింపు, రేక మూర్ఛనల విస్తరింపజేయుట, షాడవ ఔడవిత భేదాలతో నిది యేర్పడును. 2. తాళము — రెండు హస్తములకు సశబ్ద క్రియయు, నిశ్శబ్ద క్రియయు గలిగి దశ ప్రాణాలతో గూడుకొని నడిచెడి కాలము. 'హస్త ద్వయస్య సంయోగే వియోగే చాపి వర్తతే, వ్యాప్తి మన్యో దశప్రాణై స్సకాలస్తాల సంజ్ఞకః' - కాలము, క్రియ, మానము, అను మూడును తాళమునకు మూలము. 3. లయ — తాళము నడుమ నడిచెడి కాలమే. ఇది ద్రుత-మధ్య-విలంబిత-అని మూడు విధాలు 'తాళాంతరీయవ ర్తియః కాలో ఒసౌలయ నామకః, ద్రుత మధ్య విలంబాశ్చ భవేత్త్రివిథాలయాః'. 4. అనుగాయామతేర్ధర్మం కారణం జాతిరుచ్యతే'- అనుగతబుద్ధికి కారణమైన ధర్మమే జాతి-స్వరములలో మధ్యమ పంచమ-షడ్జమధ్య అని భేదాలు. షడ్జమధ్యమాశ్రయి జాతులు పదునెన్మిది శుద్ధ వికృతములతో నివి పరస్పరోత్పన్నములు - ముఖ్యంగా జాతులకు పది లక్షణాలు. అంశమనగా రాగము ఏ స్వరముచే తెలియజేయబడునో, దేనిచే ప్రవర్తింపజేయబడునో, అది జీవస్వరం. 5. జాతులు పది. 'గ్రహాంశౌ తార మంద్రౌ చ న్యాసాపన్యాస ఏవచ అల్పత్వం చ బహుత్వం చ షాడ వౌడవితే తథా.' ఇవి అంశ వికల్పనమున పదునారు. అవి షాడ్జాదులు. 6. ఏ రసములలో (శృంగారాది) ఏ అంశాలలో వాద్యానుగుణంతో బల ముండవలెనో తెలిసి ఆ రసాలలో నా స్వరములు ప్రబలంగా నుండునట్లు జాతులను గానం చేయవలెను. 7. ఆరోహి, అవరోహి - స్థాయి - సంచారి అనే భేదాలతో నున్న స్వాలు 8. వర్ణములతో అలంకారము లేర్పడును. ఇవి ముప్పదినాలుగు.

ఝుంతరి ధిగిధిత్తాం ఝుంఝుణి కిరికిటతాం
ధీంతరి తద్ధిత్తోం ధోంతత తదిగిణతాం
ణం తతత తం తతత నం ణణాణ కిటతకిట
(థ్రాం తకక కం కకక (థ్రాం టటట తరితకిట
కుతపవిన్యాసాన[1] గొనుగోలు[2] నందిచ్చి
తతి మృదంగ ధ్వాన జతులెల్ల[3] గుంఫించి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. కుతపవిన్యాసము 44 వ పదము అథోపీఠిక చూడుము.

2. కొనుగోలు - కొనిగోలు - అన నాట్యమున నటుఁడు కొలిపించు కొనుట. సంగీతమున స్వరావళి మొదలుగాగల ప్రథమాభ్యాస పద్ధతులను, పర్ణములను పాఠము చేయనివారల కెట్లు సర్వజ్ఞానము కలుగదో - అట్లే జతులకైన శబ్దములను, ఆ శబ్దములచే నేర్పడు అలంకారములను, శబ్ద - ప్రాస - యతి - పూర్వ - మధ్య - అంతములందలి ముగింపులు, ఎత్తుగడ - తీర్మానము - మున్నగు లక్షణాలతోగూడిన జతులను బారముచేసి మధ్యకాల, త్రికాలములలో కొలిపించి సాధకము చేయని వారికి విన్యాసము కొలిపింపు శక్తి, స్ఫుటోచ్చారణ కలుగదు. కొలిపింపునకు ధాతువులుగ నుండు శబ్దలక్షణాలు ముప్పదియైదు ఇవి ప్రాచీనములు.

తాళ శబ్దేన జాతాస్తు పంచత్రింశతి పర్ణకాః
తాటతో ధై ధ ధి ధు ధే థ ధి ధూ ధే ఝు ఝు న జే,
క గి గూ గే రి రూ రా రే లి లూ లే లా మ యూ యు శా
హా హ్వానుస్వారయుక్తం చ భరత శ్చేతి లక్షణం॥

3. జతులనగా మృదంగ వాద్యమున స్వరవిన్యాసమునకు హేతువులైనవి. కొనుగోలున వివరించిన శబ్ద ధాతువులును, దీర్ఘములు, అభేదాక్షరములు, తగినట్లు ఒత్తులు కూర్చినచో జతి ప్రాణశబ్దాలగును జతులను గూర్చునపుడు పూర్వశబ్దము ననుసరించియు, ఉత్తర కల్పనము ననుసరించియు, సరళ శబ్దము రెండింటితో కలుపవలెను.

ఉదా — తక్కిట - కిటతక, ధిక్కిట - కిటతక, తొంకిట - కిటతక, నంకిట - కిటతక.

ఇట్లే జతులు ప్రస్తరించుకొనవలెను. ఇవి తాళానుగుణ్యములై అనంతము లగును.

## 46

గొల్లకొమ్మల కామవల్లరులు పుష్పింప
అల్ల గంధర్వాంగ నోల్లాస ముదయింప
కిన్నరసతీ హృదయ కిన్నెరలు గిలిగింప
మిన్నాగుకన్నె లటు మిట్టి పడగలు విప్ప
కింపురుష కాంతలుఁ గీర్తనలఁ గీర్తింప
పెంపురఁ గుహ్యకుల వెలదు లింపొదవింప
ఆంగికాభినయమ్ము[1] నచ్చరల్ బచరింప
అంగు మీరంగ సిద్ధాంగనల్ చరియింప
యక్షాంగనా గాన మానంద మలరింప
రాక్షసస్త్రీ వక్ష పక్షమ్ము లదరింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 47

ఆకారమై త్రిగుణ సాకారమై కన, ని
రాకారమై నిలిచి శ్రీకారమై వినని

1 నాట్యానికి సంబంధించిన అభినయం నాల్గు విధాలు. 'చతుర్విధశ్చైవ
వే న్నాట్యస్యాభినయో ద్విజాః। అనేక భేద బాహుల్యం నాట్యే హ్యస్మిన్ ప్రతిష్ఠి
తః॥' అవి - ఆంగికము - వాచికము - ఆహార్యము - సాత్వికము.

'త్రివిధ స్త్వాంగికో జ్ఞేయః శారీరో ముఖజ స్తథా,
చేష్టాకృతశ్చైవ శాఖాంగోపాంగ సంయుతః॥
శిరో హస్త కటీ వక్షః పార్శ్వ పాద సమన్వితః,
అంగ ప్రత్యంగ సంయుక్తః షడంగో నాట్యసంగ్రహః॥'

'ఆంగికం' అన అంగముల సంబంధమైనదగు అభినయం. ఇందు దేహమంతా
త్తవే - తల, చేతులు కండ్లు, కంఠము, పార్శ్వము, కాళ్ళు, ముఖ్యాంగాలు.
కి మోచేయి ప్రత్యంగము. వ్రేళ్ళు ఉపాంగాలు. కంటికి కనుబొమ ప్రత్యం
ము. రెప్పలు గ్రుడ్లు ఉపాంగాలు. ఇట్లే తక్కినవి.

హుంకారమై కదలి భాంకారమై[1] వెలయ
టంకారమై[2] వెడలి డంకారమై[3] తెలియ
హుంకారమై కలధ ఘుంకారమై * యళుల
ఝుంకారమై కేకి క్రేంకారమై సిరుల
హ్రాకారమై కలికి హ్రీంకారమై చెలఁగు
ణాకారమై[4] లలిత క్లీంకారమై[5] వెలుఁగు
అంకారమై[6] రసా లంకారమై పలికి
శంకారమై[7] నిత్య మోంకారమై కులికి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. 'భాం' అను శబ్దము ఒక విధమగు శంఖధ్వని శంఖాలు సముద్రంలో నుండును. వానితో సముద్రం పూరించినట్లు భావం

2. వింటినారి ధ్వని.

3. ఢమర శబ్దము - 'డం క్లీబే డామరే దుర్గే పుంసి డమరుకేఽపిచ' - నానార్థ రత్నమాల. *వీణ కంఠమునుండి వెడలు ధ్వని విశేషము - లనేకపస్వరము.

4. గో రూపము. 'ణా ప్రియాం రజనీ శయ్యా ధేను నాసా కృపాసుచ' నానార్థ రత్నమాల

5. దేవీమంత్ర బీజాక్షరము. శక్తి మంత్రములకు - బీజ-శక్తి-కీలకాదులైన శక్తి ప్రణవాక్షరములు. ఓం - ఐం - హ్రీం - శ్రీం - క్లీం - సౌః - ఇది బాలా త్రిపురసుందరీ మంత్రమున-'అస్యశ్రీ బాలా త్రిపురసుందరీ మహామంత్రస్య-ఈశ్వర ఋషిః - అనుష్టుప్ ఛందః - శ్రీ బాలా త్రిపురసుందరీ దేవతా ఐం బీజం - సౌః శక్తిః - క్లీం కీలకం అని

'ఐంకారాసన గర్భితానల శిఖాం సౌః క్లీం కళా బిభ్రతీం
సౌవర్ణాంబర ధారిణీం వరసుధా ధౌతాంతరంగోజ్వలాం,
వందే పుస్తక పాశ సాంకుశ జప స్రగ్భాసురోద్యత్కరామ్
తాం బాలాం త్రిపురాం భజే త్రినయనాం షట్చక్ర సంచారిణీం॥'

6. శృంగారము (అంకరించు — శృంగారించు) మఱియు పరబ్రహ్మ స్వరూపం. 'అం స్యాచ్చ పరమం బ్రహ్మ అః స్యాచ్చైవ మహేశ్వరః' - హారావళి.

7. శుభము గూర్చునది. 'శం సుఖం శంకరః శ్రేయః శశ్చ సీమ్ని నిగద్యతే' - హారావళి.

48

చిఱుమోవిపై వెలయు చిట్టి పిల్లనగ్రోవి
చిఱుచేతులన్ మలయు చిట్టిప్రేళుల యూవి[1]
ఆవిలోఁ[2] సరిగమల యల్లికలు మొల్లఁగా
మూవుకొని గమకములు[3] ప్రోవుకొని చల్లఁగా
అల్లనన్ దానములు[4] ఎల్లవీ యుల్లముల
ఉల్లాసములఁ జల్లి పల్లవించెడు రుచుల
క్రేళ్ళురికి గోకులము క్రీడించి వీక్షింప
త్రుళ్ళి ఝల్లున గుండె తల్లడిలి కుంచింప
బొక్కలాడటు[5] సక్కి బిక్కుబిక్కునఁ గదల
ఇక్కడచి మృగశీర్ష[6] మిరుగేల నిడి వెడల
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

49

శుద్ధమాధ్యమ జన్య శుద్ధస్వరమ్ము[7] లో[6]

1. ఊఁగు - చలించు
2. ఊర్పు - శ్వాసము.
3. ఎర్వ విన్యాసములు.
4. 44 వ పదము అథోపీఠిక చూడుము.
5. సర్పము.

6. అసంయుత హస్తము. సర్పశీర్ష హస్తంలోని ఉంగరపువేలు, నడిమిప్రేలు, మూపుడుప్రేలు - ముడిచి చిటికెనప్రేలు బొటనప్రేలు చాచిపట్టవలెను - 'అథో మృగీనాం సర్వాసా మంగుళీనాం సమాగమః కనిష్ఠి కాంగుష్ఠకౌ పూర్ధ్వౌ స భవే న్మృగశీర్షకః' ఇది రెండుచేతుల నెదురుగా మోముకడ ప్రక్కగా (పిల్లనగ్రోవి పట్టినట్లు) కృష్ణావతార సూచకము.

7. శుద్ధ మధ్యమ జన్యమై శుద్ధస్వరములు గల రాగము హనుమత్తోడి. ఇది ఎనిమిదవ మేళకర్త. ఇందు శుద్ధ ఋషభము - సాధారణ గాంధారము. శుద్ధమధ్య

## 57

శుద్ధ సీమంతినీ[1] ముగ్ధ హృదయమ్ములో
సంధాన చాతురిఁ బ్రవృత్తి న్నొలికించి
గాంధార ధారలోఁ గైశికిఁ దొలఁగించి
సారిగమ-పదనిసా-సానిదప-మగరిసా
సారిగమ-పాదసా - సాదపా-మగరిసా
రాగాంగ ప్రక్రియల సంగుళీ న్యాసమ్ము
నాగేంద్ర విభ్రమోద్వేగ నాదోద్ధృతము
సంశయాత్మక మహా సంక్షోభ మొనరింప
వంశ్యాశ్రిత శ్రుతిక[2] భావాభిరుచి బెంప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 50

ఆ నటనముఁ జూచి, ఆ హరుఁడు హర్షింప
ఆ నృత్యముఁ గాంచి, ఆ గిరిజ లజ్జింప

ఱము - పంచమము - శుద్ధధైవతము - కైశికీ నిషాదము స్వరస్థానములు. రాగాం
ము, సప్తస్వర సంపూర్ణ గమక వరిక, రక్తిరాగము. దీనికి శుద్ధ కర్ణాటకమనియు
మాంతరము. అపరాహ్ణమున పాడదగినది.

1. ఇది హనుమత్తోడి జన్యమగు రాగము. ఇందు కైశికీ నిషాదము లేదు.
రి గ మ ప ద స - స ద ప మ గ రి స, ఆరోహణ అవరోహణ స్వరములు.

2. వేణువునందు శ్రుతి సంఖ్యాభేదముచే నేర్పడునది. ఇది మూడు విధాలు
ృతికము - త్రికము - చతుష్కము. ఇవే క్రమంగా అర్ధాంగుళి - కంపమానాంగుళి
్యక్తముక్తాంగుళి - అని. వ్యక్తముక్తాంగుళి స్వరము చతుశ్శ్రుతికము-కంపమానాం
ళి త్రిశ్శ్రుతికము. అర్ధాంగుళి ముక్తస్వరము ద్విశ్శ్రుతికము. ఈ స్వరాలు మధ్యమ
గామంలో నెక్కువ. వ్యక్తముక్తాంగుళిచే షడ్జ-మధ్యమ-పంచమస్వరాలు పుట్టును.
ంపనాంగుళిచే ధైవత - ఋషభ - స్వరాలు పల్కును. సర్వసాధారణమైన కాకలి
ంతర స్వరాలు కూడ కంపమానాంగుళి వలన నేర్పడును. నిషాద గాంధార
ములు-షడ్జ మధ్యములు శ్రుతిక లక్షణములనుబట్టి మారుచుండును. ఈ స్వరాలు
ల్లనగ్రోవి పరిమాణాదులనుబట్టి నిర్ణయమగును.

## 58

ఆ హాయ ల్దిలకించి, ఆ యజుఁడు ప్రార్థింప
ఆ హాస రుచి దెలిసి, ఆ వాణి వికసింప
ఆ భావముల్ దలఁచి, ఆ వజ్రి నుతియింప
ఆ భాగ్యము న్నెంచి, ఆ శచియు భజియింప
ఆ వికాసము గాంచి, ఆ మునులు పూజింప
ఆ విలాసము నెంచి, అప్సరల్ నటియింప
ఆ గోపికా గోపు లానందమును బెంప
ఆ గోకులమ్ము ననురాగమునఁ బాలింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 51

ఆ చలిత చంద్రక[1] మ్మాచంద్ర శకలమ్ము
ఆ చారుశిఖ పాటలాంచిత కపర్దమ్ము
అ న్నొసటి తిలకమ్ము చెన్నొందు ముక్కన్ను
అ న్నీలమణిహార మహిహారముల నెన్ను
ఆ పసిమి పచ్చడ మ్మయ్యేనికపుఁ దోలు
ఆ పసిడి మొలత్రాడు పెన్పాప మొలనూలు
అ మ్మురళి నిస్వన మ్మా ఢమర శబ్దమ్ము
అమ్మేఘ రుచిరమ్ము సమ్మోహ ధవళమ్ము
ఆ హరియె హరుఁడగుచు నాహరుడె హరియౌచు
ఆ హరీంద్రుని గర్వ మాహరించెద ననుచు.
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. నెమలిపురి.

## 52

సప్తరూపమ్ములో స్వరసంచయాంగమ్ము
గుప్తముగు తాళానుగుణ లయబ్రహ్మమ్ము
పాపమరి – గరిసనీ – పనిసాస – నిసరిసని
పాపమస – నిసరినిస – పమరిగా – గరిసనీ
పనిసరిగ – రిరిగరిరి – సనిపనిస – రీనిసా
సనీపధ – నిపమరిగ – సారినీ – పనినిసా[1]
సంధాన వర్ణనాశ్రయాలంకృతమ్మై
బంధుర స్వరములన్ బంచమము వర్జ్యమై
శ్రీరాగ రంజిత శ్రీవిలాసముతోడ
శ్రీరంజనిన్[2] గోప సీమంతినులు బాడ

ఆడెనమ్మా! కృష్ణుడు
పాడెనమ్మా విష్ణువు.

## 53

విరియు మొగ్గలవోలె వెలయించు సొబగులను
సురియు తీవెలవోలె సాగయించు విసుగులను

1 ఇది శ్రీరాగ స్వరమేళనము సరిమ పనిస - సరిపదని పమ రిగరిస - ఆరోహణావరోహణ స్వరములు. 22 వ మేళకర్త ఖరహరప్రియ రాగ జన్యము. ఆరోహణమున గాంధార ధైవతములు వర్జ్యములు. చతుశ్రుతి ఋషభము. శుద్ధ మధ్యమము - పంచమము. కైశికినిషాదము - ఆరోహణమున స్వరస్థానాలు. కైశికి నిషాదము - పంచమము - చతుశ్రుతిధైవతము - కైశికినిషాదము - పంచమము - శుద్ధ మధ్యమము - సాధారణగాంధారము - చతుశ్రుతిఋషభము - వరుసగా అవరోహణ స్వరస్థానాలు. షాడవ - వక్రసంపూర్ణఘనరాగం. సమస్త మంగళ ప్రదమైనరాగము. ఎల్లపుడు పాడదగినది 2. శ్రీరంజనీరాగము ఇది ఖరహరప్రియ జన్యము - 22 వ మేళకర్త - చతుశ్రుతి ఋషభము - సాధారణగాంధారము - శుద్ధమధ్యమము - చతుశ్రుతిధైవతము - కైశికినిషాదము - ఆరోహణావరోహణ స్వరస్థానములు - సరిగమ

## 60

నాగుఁబాముల పగిది నాఁగి పడగలు విప్పి
శేఁగి విసురునఁ జుట్టి ప్రోఁగుగా మెయిగప్పి
చిటికొమ్మపై గువ్వ చేరి కూర్చుండినటు
పొటుకు పొటుకున ముక్కు పుటకరించినయట్లు
విదళించి గజముపై వెడలు సింహము మాడ్కి
ఒదిగి వడిమీరఁగా నుప్పరించుచు³ రెక్క
హరిణశాబకరీతి నందందుఁ గ్రేళ్ళురికి
జిఱికొట్టి మెడఁద్రిప్పి చిలిపికన్నులఁ జిలికి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 54

ఉస్పందితమ్మున⁴ నూఁగించి పాదమ్ము
ప్రస్పందిత ధ్వనుల్ ప్రకటింప నూపురము

ధనిస - సనిధమగరిస - ఇందు పంచమములేదు. షాడవ వక్ర రాగము. చతుశ్రుతి ఋషభము - చతుశ్రుతి ధైవతములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లపుడు పాడ వగిన రాగము శ్రీరాగచ్ఛాయలో శ్రీరంజనీరాగం పాడిరని భావం. 3. ఇది మల్లి ముద్ర క్రియ. ఉప్పళించు - విక్కు - కుప్పించు.

4. దీన్ని ఉత్స్యందిత అంటారు. భామీచారి. రేచకమునందువలె (అనఁగా ంగములలో నేయొకదానినేని ఉన్నచోటునుండి గుండ్రముగా త్రిప్పుటగాని, దల్పుటగాని, పైకెత్తుటగాని, స్వేచ్ఛగా చలింపజేయుట) రెండు పాదాలు మంగా ప్రక్కకు నూపవలెను.

5. ఇది వైష్ణవ స్థానకము. ఒక చేయి రేచితంగా మరొకటి అలపల్లవంగా మున నుండును. తల లోలితముగ (అన్ని వైపులకు తల నాడించుట) విశ్రాంతి నుపవలెను. 'వైష్ణవస్థానకం హస్తౌ రేచితోఽన్యోఽలపల్లవః, వక్షఃస్థో లోలిత ం, విశ్రాంతిః, పార్శ్వయోః క్రమాత్। యత్ర కుర్వీత తత్ తద్జ్ఞైః లోలితం పాదితః' - నృ.ర.

# 61

లోలితమ్ము[5]గ నిల్చు లీలరేచిత కటిఁ[6]
చాలితమున హస్త చతురశ్రముఁ[7] పుటిఁ
బ్రసృతమ్ము[8] బచరించి పరవశ మ్మొగిమీఱ
విసృతమ్ము[9] చూపించి విభవమ్ము బొల్పార
దివ్య తేజమ్ము నల్దిక్కులన్ బ్రసరింప
భవ్యసంప్రాప్తమ్ము భద్రమై యలరింప
మిటకరించుచు సర్వ మటనునఁ మ్రైగుంగ
అటుసాఁగి యిటులాఁగి పటము గ్రక్కదలంగ

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

# 55

నల్లమబ్బులు నింగి నల్లుకొన్న విధాన
చల్లగాలులు రేఁగి సాఁగి వీచు విధాన
హరివిల్లు రంగులఁ హావళించెడు విధాన
మరువిల్లు తూపులఁ మిరులుగొల్పు విధాన
జాబిల్లి వెన్నెలల్ సల్లుజల్లు విధాన
జాబిలీరా[10] ల్గరిగి జారుకొన్న విధాన
తెలిదమ్మి యరవిచ్చి యలరించెడు విధాన
తొలిసంజలోఁజుక్క తొంగిచూచు విధాన

4. నడుము నన్నివైపులకు గుండ్రముగా ద్రిప్పుట. 'సర్వతో భ్రమణాచ్చాపి విజ్ఞేయా రేచితా కటీ' -

7. ఇది చతురశ్ర అంగము. 'కటీ నాభి చరౌ హస్తౌ వక్షశ్చైవ సమున్నతం వైష్ణవస్థాన మిత్యంగం చతురశ్ర ముదాహృతం' - వైష్ణవస్థానమున నిలిచియున్నపుడు హస్తములు క్రమంగాగాని, ఒకేసారిగాని, కటి, నాభి, చరములుగా వక్షము సమున్నతంగా నుంచవలెను.

8. కొంచెము వంచిన హస్తము (చేయి-చేర)

9. విస్తారము - విరివి (విచ్చిచూపిన చేయి)

10. జాబిలితాయి - జాబిలీతాయి - జాబిల్లితాయి = చంద్రకాంతము.

కొండకొమ్మున బ్రొద్దు కొలువుదీరు విధాన
గండరించిన చిల్వ గుండెలూడు విధాన
నాడెనమ్మా! కృష్ణుడు
పాడెనమ్మా! విష్ణువు.

## 56

పార్శ్వాభిముఖముగా[1] బరికించి శిరమూంచి
పార్శ్వజానువు[2] గాగ బాదచార మొనర్చి
చంద్రార్ధహస్తమ్ము[3] సంచలిత రేచకము[4]
సాంద్రాలకా రుచిర సాలంకృత ముఖమ్ము

1. ప్రక్కకు యెదురుగా చూచి - 'పార్శ్వాభిముఖ మన్వర్థం పార్శ్వ వస్త్వావలోకనే.'

2. ఇది కరణము. ఇందు ఒక పాదము సమంగానుండి రెండవ పాదము తొడ ప్రక్కకు గావలెను. ముష్టిహస్తము తొమ్ముమీద నుండవలెను. (కటియందు అర్థచంద్రహస్త ముండవలెనని అభినవగుప్తుడు.) ఇది యుద్ధ నియుద్ధములలో ప్రయుక్తము. 'యస్మిన్ సమస్థిత స్యాంఘ్రే రూరు పృష్ఠే వ్యవస్థితః, అన్యోంఘ్రి రథ వక్షస్థో ముష్టిః స్యా దపరః కరః॥ అర్ధచంద్ర కటీ సంస్థ పార్శ్వజాను తదీరితమ్, బుధై ర్యుద్ధే నియుద్ధే చ వినియోగోఽస్య కీర్తితః' - ఒక కాలికొనను ఇంకొక కాలితొడలో ప్రక్కలో నిలుపుట - అని పాఠాంతరము భట్టతండులు చెప్పెను. చూ:— నృత్తరత్నావళి.

3 దీన్ని అర్ధచంద్ర హస్తమంటారు. పతాక హస్తమందు అంగుష్ఠము చాచబడవలెను. 'అర్ధచంద్రకరస్సోఽయం పతాకేఽఙ్గుష్ఠ సారణాత్' ఇది తన్నుతాను చెప్పుకొనుటలో ప్రయోగి - 'భుక్పాత్రే చోద్యవే కట్యాం చిన్తాయా మాత్మవాచకే' అభి. ద

4. రేచకములు నాల్గు. పాద - కటి - కర - కంఠములు - చారీ కరణాదుల యందు ఇతరములందు, అంగములలో ఏ ఒకదానిని స్వస్థానమునుండి కదల్చుట, లేక గుండ్రముగా ద్రిప్పుట, పైకెత్తుట, స్వేచ్ఛగా చలింపజేయుట రేచకము (రేచితము) పాదాదు లిందు మొత్తముగా గదల్పవలెను. వ్రేళ్ళమీద మెడమమీద నిల్చి కదల్చిన రేచకము కాదు. పాదమంతటిని యెత్తి కదల్పవలెను. తక్కినవి అల్లే —

## 63

ప్రకటాంతరః కళాభావముల్ వెలయంగ
చకితదృష్టి[5] పథమ్ము సర్వమ్ము నెమకంగ
మణిహార మాకంపమానమై దిగజార
క్వణిత కంకణ రత్న కాంతిచ్ఛటల్ మీర
పీతాంబరం బల్లఁ బిరిగొనుచు నూఁగాడ
వాతాశికిఁ[6] జీవవల్లరుల్ దెగియాడ

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 57

కైశికీ వర్జ్యమ్ము నాశుద్ధధైవతము
వశమైన రీతిలో భావశబలత బలము
ఆనుపూర్విగ వెలయు నా నిషాదాంత్యమ్ము
వేణు ప్రకల్పనావిష్కృత సర్వమయము
ఎన్నఁ జతుశ్రుతిని ఋషభమ్ము పున్నాగ[7]
సన్నుతము – గారిగా – సగరిగా – గమమగా
గరిసనీ – గరిగాగ – గమపాప – ధనిధాప
గరిగాగ – మామగా[8] – గమకమ్ములో నిలుప

5. భయముతో గూడిన చూపు - చలింపబడిన చూపు.

6. పాము.

7. ఇది పున్నాగవరాళి అను రాగము. 8వ మేళకర్త - హనుమత్తోడి జన్యము. నిషాదాంత్య రాగము. మంద్రస్థాయియందు దీర్ఘ గాంధార మధ్యములును, కైశికీ నిషాద సంకలిత శుద్ధధైవతములు - రాగచ్ఛాయాస్వరములు. ఎల్లపుడు పాడదగినది. 8. ఇవి పున్నాగవరాళి రాగమున రాగరంజకములైన ప్రయోగములో కొన్ని స్వరాలు.

పున్నాగ[1] మెక్కి యాపూరముగఁ బూరింప
మిన్నాగు పైమఱచి మీఁదఁ బడగలు విప్ప
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

58

నెత్తావి విరజల్లు నెత్తమ్మి విరులట్లు
గుత్తంపుఁ జివురులోఁ గులుకు మొగ్గల యట్లు
నెలయేటి తుంపురుల్ చెలఁగి చిందిన యట్లు
నెలరాజు నింగిపై నిలిచి యాడిన యట్లు
మిట్టుమబ్బులలోన[2] మించు తీవియలట్లు
చిట్టంపుటలలపైఁ దారాడు సుడులట్లు
సంజ కెంజాయలోఁ బుంజుకొను వెలుఁగట్లు
పింజించు తేనియల్ బీల్చు తుమ్మెద యట్లు
ప్రేముడిఁ జవరాలు పెదవి విరిచిన యట్లు
కామినిఁ బిగియారఁ గౌగలించిన యట్లు
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

59

అలక లల్లాడుచున్ మెలికలై దిగు కొన్ని
కలికలై చెవులందు కళుకులై తగు కొన్ని
శిఖపైని పురులూడి చెదరి పైఁబడు కొన్ని
ముఖకాంతు లల్లల్ల మొనసి మూఁగును కొన్ని

1. పొన్నచెట్టు (సురపొన్న) పురుషశ్రేష్ఠుఁడైన కాళీయసర్పమనిభావం.
2. ఎగురుచున్న మేఘములలో —

చిఱుపెదవిలో నవ్వులొలసి జారును కొన్ని
ఎఱుపు బుగ్గల వెల్గు లురల బారును కొన్ని
తెలిదమ్మి హారమ్ము లలర నాడును కొన్ని
మొలనూలి ముత్తెములు మురిసి క్రేలును కొన్ని
జిలుఁగు కన్నులలోనఁ జిక్కశిల్ మెఱయఁగా
ఘులుఘుల్లుసన్ గాళ్ళ గజ్జియ మ్రోయఁగా
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

౬౦

ఆకులో నాకులై యడఁగి యుండిన యట్లు
రేకులో రేకులై రేఁగి నిల్చిన యట్లు
పూవులోఁ బూవులై పూచి విచ్చిన యట్లు
తావిలోఁ దావులై దరిసి మూఁగిన యట్లు
కొమ్మలోఁ గొమ్మలై కొఱలి పెరిగిన యట్లు
రెమ్మలో రెమ్మలై రెక్క సల్చిన యట్లు
వెలుఁగులో వెలుఁగులై విరియఁ బారిన యట్లు
పలుకులోఁ బలుకులై పరిఢవిల్లిన యట్లు
రూపులో రూపులై రూపుమాసిన యట్లు
పాపలోఁ బాపలై పాప మూడ్చిన యట్లు
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

౬౧

ఆ చూపు లేవైపో; ఆ వైపు హస్తమై[1]
ఆ చార[2] మేవైపో; ఆ వైపు పాదమై

1. ఎచ్చట హస్తము చూపబడునో అచ్చట దృష్టి - దృష్టియున్నచోట మనస్సు - మనస్సున్నచోటభావం - భావమున్నచోట రసం ప్రదర్శింపబడును. - 'యతో హస్త స్తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః, యతో మనః స్తతో భావో యతో భావ స్తతో రసః' - 2. తొడ-నడుము పాదము - పిక్క (జంఘ) వాని

ఆ వృత మ్మో[3]వైపో; ఆ వైపు నృత్యమై
ఆ వేణు వేవైపో; ఆ వైపు నాదమై
ఆ కృత మ్మో[4]వైపో; ఆ వైపు నటనమై
ఆ కరణ మే[5]వైపో; ఆ వైపు భావమై
ఆ చలన మేవైపో; ఆ వైపు లలితమై
ఆ చిబుక మేవైపో; ఆ వైపు హాసమై
ఆ పింఛ మేవైపో; ఆ వైపు గ్రీవమై[6]
ఆ పలుకు లేవైపో; ఆ వైపు గానమై
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు

**62**

సమముగా నంగముల సమకూర్చి ధృతినించి
సమశీర్షమున[7] నిక్కి సమపాద మొనయించి

కర్మలయొక్క (కదలికలయొక్క) కూడికతో గూడినచేష్ట. దీనికే వ్యాయామమని పేరు. ఏకపాద ప్రచారం చారి.

3. మృదంగ జతుల విన్యాసము - అవృతము. తాళప్రారంభమాత్ర కాలము నుండి అంత్యమాత్ర కాలముపఱకుగల కాలమును అవృతమందురు. [ఆదితాళం ఎనిమిది అక్షరములు (మాత్రలు) ఒకసారి పూర్తియగుట అవృతము.]

4. చేష్ట.

5. రెండుపాదముల ప్రచారం 'కరణం' - మూడు పాదముల ప్రచారం 'ఖండం' - మూడు లేక నాల్గు ఖండముల కూడిక 'మండలం'.

6. గ్రీపము (మెడ) యొక్క కర్మలన్నీ (చేష్టలన్నీ) శిరఃకర్మానుగాములు - 'గ్రీవా కర్మాణి సర్వాణి శిరః కర్మానుగాని హి, శిరసః కరణా కర్మగ్రీవాయాః సంప్రవర్తతే' కావున నిట శిరముపై పింఛము ఏవైపునకు వ్రాలునో కంఠమావైపునకు వ్రాలును -

7. క్రిందికి వంచక మీది కెత్తక నిశ్చలముగానున్న శిరస్సు - 'నిశ్చలం సమమాఖ్యాత మున్నత్యా నతివర్జితమ్' - నృత్తారంభము - గర్వము - కోపాదులందు




గజదంత మొనరించి కర్తరీముఖ మొప్ప
విజయమ్ము చేకొనుచు వేదాలు గ్రహియింప

వినియోగం. 'నృత్తారంభే జపాదే చ గర్వే ప్రణయకోపయోః స్తంభనే విప్రిక్రియా త్వేవ సమశీర్ష ముదాహృతమ్' 8. సంయుతహస్తము. సర్పశీర్ష హస్తములు రెంగింటిని పరస్పరము రెట్టలపై (బాహుద్వయమధ్యమున) నుంచవలెను. స్తంభము గ్రహించుట - భారమువహించుట - రాతిని పెల్లగించుటయందు వినియోగం 'బాహుమధ్య గతౌ సర్పశీర్షౌ స్వస్తికతామితౌ, యది స్యాద్గజదంతోఽయం పరమాత్మాఽధిదేవతా' - 'స్తంభగ్రహే శిలోత్పాటే భారగ్రాహే వియుజ్యతే' 9. అసంయుత హస్తము. అర్ధపతాకమందలి చిటికెనవ్రేలు చూపుడు వ్రేలు బైటికి చాచిన కర్తరీముఖము. 'అస్యైవ చాఽపి హస్తస్య తర్జనీచ కనిష్ఠికా, బహిః ప్రసారితే ద్వేచౌ

## 68

కరపృష్ఠమున[1] పతాకద్వయ[2] మ్మగు రీతి
సరిగాగ చిటి్ౕరవేలు చలియింప మత్స్యగతి
విరివిగా పడిమీర లిచ్చి క్రిందున త్రిప్పి
కరములఁ మోమున శకట హస్తమున్[3] నిల్పి
మత్సరాహి ఫణాగ్ర మకుట ప్రభానమై
ఉత్సాహమున వెలయ మత్స్యావతారమై[4]

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

## 63

మందరాచల చలిత మాంహోర్మికా కలిత
బంధ భుజగావృత నిబంధ విభ్రమోద్ధృత

త్వ కరః కర్తరీముఖః' దొంగలించుట - చావు - భేదించుట మున్నగువానిలో విని యోగం - 'లుంఠనే నయనాన్తే చ మరణే భేదభావనే' - 1. చేతుల వెనుకభాగము నందు (మణికట్టునందు) 2 పతాకహస్తములు రెండు చేర్చుట - అన్ని వ్రేళ్ళను చేర్చి చాచి బొటనవ్రేలు వంచిపట్టుట - ఇది సముద్రమును సూచించును. 'తత్ర తత్రేతి వచనే సింధౌతు సుకృతి క్రమే' - రెండు ఒకదానిపై నొకటిచేర్చి చిటి్ౕరవేళ్ళు చలింపజేసిన మత్స్యమును సూచించును. 3. రెండు భ్రమరహస్తాలు (నడిమివ్రేలు బొటనవ్రేలు తాకునట్లు పట్టి చూపుడు వ్రేలువంచి మిగత వ్రేళ్ళు చాచినవి) 'మధ్యమాంగుష్ఠ సంస్పర్శే తర్జనీ వక్రితా యది, శేషా ప్రసారితా యత్ర భ్రమరాభిద హస్తకః' - బొటనవ్రేలిని నడిమివ్రేలిని చాచిన శకటహస్తము - ఇది రాక్షసులు మున్నగువానిని సూచించును. 'భ్రమరౌ మధ్యమాంగుష్ఠ ప్రసారా చ్ఛకటో భవేత్, రాక్షసాభినయే చాఽయం నియుజ్యోఽభరతాదిభిః' - 4. మత్స్యహస్తముచూపి రెండు త్రిపతాకములు భుజశిరములకు సమంగా పట్టిన మత్స్యావతారం - 'మత్స్య హస్తం దర్శయిత్వా తత స్కంధసమౌ కరౌ, త్రిపతాకౌ యది ధృతౌ యుజ్యతే మత్స్య జన్మని.' అభి. ద.



ఉన్మత్తకా కరణ[1] యోగ సంజనితమ్ము
ఉన్మథన క్షీరాబ్ధి నుత్స్యంది చారమ్ము[2]
వక్రహస్తమ్ములో[3] సారించు నంగుళుల్

అంచితపాదను (వంచినపాదము మడమలందు నేలపై నుంచి పాదతలము
త్తి అన్ని వ్రేళ్ళుచాచి నడుపునది.) రేచిత హస్తము ప్రదర్శించి అవిద్ధ
వ్తికముగానున్న పాదాలు విడదీసి) కుంచితపాదము (మడమ పైకెత్తి
ధ్యభాగము ముడుచునది) ముందుకు చాచి అంచిత పాదముగా రెండవ
ఒక్క మడమమీద నుంచినది - ఈ కరణము సౌభాగ్యగర్వమున ప్రయో
2. ఇది భౌమిచారి. చూ. 54 వ పదము అధోపీఠిక. 3. సంయుత
- అర్ధచంద్రహస్తములను అడ్డంగా రెండుఅరచేతులను జేర్చి పట్టవలెను.

ప్రక్రమత్రిపతాక[1] భావాంతర ద్యుతుల్
అమృతోదయ ప్రకట సార్ధ చంద్రకరమ్ము[2]
ఆ మృష్ట హాలాహలాఽస్వదిత హావమ్ము
అరాళ కరాంచిత[3]మ్మానంద కలితమై
క్రూరాహి ఫణముపై కూర్మావతారమై[4]
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

64

కుంచిత క్రమపాద[5] కుంచితోద్వృత్తమ్ము[6]
సంచలిత సౌష్ఠవా[7] శ్రయ దివ్యహారమ్ము

చక్రము తిరిగినట్లు సూచించుట 'యాత్రార్ధ చంద్రౌ తిర్యక్ప్రాచ్యనోన్యతలసంస్పృశౌ చక్రహస్త స్సవిజ్ఞేయ శ్చక్రార్థే వినియుజ్యతే'. - 1. పతాకహస్తమందలి ఉంగ్రపు వ్రేలు వంచిపట్టవలెను. ఇది అగ్నిజ్వాల సూచితము - సముద్రమున హాలాహలోద్భవ సూచితము. 'వహ్నిజ్వాలా విజృంభణే' - అని వినియోగము. 2. పతాకహస్తమున బొటనవ్రేలు చాచిపట్టవలెను. ఇది పుట్టుకను తెలుపును.' భుక్త్వాత్రే చోద్భవే కట్యాం, చిన్తాయా మాత్మవాచకే' ఇందు అమృతోదయసూచనము. 3. పతాకమున చూపుడు వ్రేలు వంచవలెను. 'పతాకే తర్జనీ వక్ర నామ్నా సోఽయ మరాళకః' ఇది విషము. అమృతము మున్నగునవి త్రాగుటయందు చూపబడును. 'విషామృతాది పానేషు ప్రచండపవనేపి చ'. 4. కూర్మహస్తాన్ని చూపి (చక్రహస్తము మొనవ్రేళ్లు వంచి, చిటికెనవ్రేలు బొటనవ్రేలు చాచి పట్టినది) మూపులకు సమంగా త్రిపతాక హస్తాలు పట్టవలెను. ఇది కూర్మావతారము సూచించును. 'కూర్మహస్తం దర్శయిత్వా తత స్కంధసమాకరౌ, త్రిపతాకౌ యది ధృతౌ యుజ్యతే కూర్మజన్మని, ధృతా కూర్మావతారస్య హస్త ఇత్యుచ్యతే బుధైః' - అభి. ద.

5. విశేషపాదకర్మ సూచీపాదం కుడికాలి బొటనవ్రేలిపై నిల్చి మడమ పైకెత్తి ఎడమపాదం స్వభావసిద్ధంగా వుంచుట - ఇది నృత్తమున నూపుర కరణము నందు ప్రయోగము. మఱియు మడమ పైకెత్తి వ్రేళ్ళు వంచి పాదమధ్యమును వంగునట్లు ముడుచుట - ఉదాత్తమైన నడకయందు, వృత్తితోద్వృత్తములందు (క్రిందు మీదులు చేయుట) అతిక్రాంతిచారి యందు ప్రయోగము. 6. వంచి పైకెత్తుట. 7. కటీ - కర్ణము లొకే రేఖలోను, మోచేతులు, మూపులు - ఒకే రేఖలో నుండగా



పీడిత క్ష్మాతలా విష్ణుక్రాంతారంభమ్ము
మూఢ రాక్షస గర్వ మూడించు యత్నమ్ము
మృగశీర్ష హస్తమ్ము[8] మొగడించి మెయి విప్ప

ఉరము సమున్నతమై యుండుట. నాట్య నృత్తములు రెండూ సౌష్ఠవమునసే ప్రతిష్ఠింపబడును. నాట్య నృత్త శోభ అంగసౌష్ఠవము మీదనే ఆధారపడి యున్నది. స్థానకము (నిలిచెడి పద్ధతి) చారులు (పాదముల కదలికలు) నృత్తహస్తములు - ఇవి మాతృకలు. వీని కలయికవలన కరణము లేర్పడును. 'కటీకర్ణ సమా యత్ర కూర్పరాంస శిర స్తథా, సమున్నత మురశ్చైవ సౌష్ఠవం నామ తద్భవేత్' -

8. సర్పశీర్ష హస్తమునందలి చిటికెనవ్రేలు చాచవలెను. 'అస్మిన్ కనిష్ఠకాంగుష్ఠే ప్రసృతే మగశీర్షకరః' ఇది తెలుపునన్నె సూచనము. (ఇందు శ్వేతవరాహమని

తగురీతి కటిపార్శ్వతలముపై[1] కర మొప్ప
భ్రూక్షేప మొనరంగా మూర్ధ భాగోన్నతము
విక్షేపమున శిరము వెలయు నుద్వాహితము[2]
శృంగాగ్రచరదృష్టి పొంగార దృప్తమై
భంగిమలు ప్రకటించి వరహావతారమై[3]

ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

65

పార్శ్వజాను క్రమము[4] పదగతి ప్రకటనము
పార్శ్వాభిముఖ విధి ప్రచలితోర్ధ్వ శిరమ్ము[5]
రోష కంపిత గండ[6] రోచిచ్ఛటాంతమ్ము

భావము) 'ఋషిజాతా కుభ్రువర్ణే మృగశీర్షకరః స్మృతః' - మఱియు నిది యొక దానిపై నొకటిచేర్చి చిటికెన బొటనవ్రేళ్ళు కూడబట్టిన వరాహమును సూచించును. 'మృగశీర్షే త్వన్యకర స్తేనశ్లిష్టస్థితో యది. కనిష్ఠాం గుష్ఠయో ర్యోగా ద్వరాహాః కర కీరితః ఏతస్య వినియోగస్తు వరాహార్థేతు యుజ్యతే' - 1. పిరుదులపై. 2. కొంచెము పైకెత్తబడిన తల. 'సకృదూర్ధ్వం శిరో నీత ముద్వాహిత శిరో మతం' దేనికైనా నేను తగుదును అను గర్వమున బ్రయోగము 'శక్తోఽహ మస్మికార్యేష్వి త్యభిమానే ప్రయుజ్యతే' - 3. వారాహ హస్తము చూపి పిరుదులందు హస్తముంచిన వరాహావతారము. 'దర్శయిత్వా వరాహంతు కటి పార్శ్వ సహౌకరౌ, ధృతౌ వరాహ దేవస్య హస్త ఇత్యభిదీయతే - అభి.ద.

4. ఒక పాదం సమంగా వుంచి రెండవపాదం తొడప్రక్కకు చేర్చవలెను. ముష్టిహస్తము బొమ్మ మీద పట్టవలెను. కటిపై అర్ధచంద్రకిరముండవలెనని కొందరు. యుద్ధ, నియుద్ధ, విషయముల నిది యుపయోగము. 5. ప్రక్కకు ఎదురుగ - నియమానుసారం చలింపజేయుచు పైకెత్తిన తల - ఒక ప్రక్కకు త్రిప్ప బడిన శిరస్సు ప్రక్కకు చూచుట యందుపయోగము. 'పార్శ్వాభిముఖ మన్వర్థం పార్శ్వస్థస్యాఽవలోకనే' - 6. కంపిత గండము - గండక్రియలారింటిలో నొకటి -



ఈషదుజ్జ్వల తారకేక్షణా వలనమ్ము[7]
ఉచ్చలిత ముఖకేసరాచ్ఛాది తోగ్రమ్ము
హృచ్ఛేద గర్జాస్య హేతి ప్రహాసమ్ము

ఈష - ఫుల్ల - ఘూర్ణ - కంపిత - కుంచిత - సమములు. చెక్కిళ్ళు వదిరువట్లు చేయుట రోషహర్షములందు ప్రయుక్తము. 7. వలనము - ఇది తారాకర్మకు సంబంధించినది. తారకలు (కనుగ్రుడ్లు) ముక్కోణంగా (త్ర్యశ్రముగా) త్రిప్పుట - వీర రౌద్రరసముల నుపయోగము. కోపముతోనున్న సింహము చూపు.

సింహముఖ లక్షణాశ్రిత వామహస్తమ్ము[1]
సంహితత్రిపతాక సంజ్ఞార్పిత కరమ్ము[2]
ఆహ్లాదమున దివిజులంజలిడ భక్తిమై
ప్రహ్లాదుఁ బ్రోచిన నృసింహావతారమై[3]

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 66

భవితవ్య నృత్తాంగ వైష్ణవ స్థానమ్ము[4]
భువన రంగాంతరిత భుజంగత్రాసితము[5]

1. నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు, ఈ రెంటికొనలు బొటనవ్రేలితో చేర్చి తక్కిన వ్రేళ్ళను చాచిపట్టిన సింహముఖహస్తం. ఇది ఎడమచేత పట్టవలెను. 'మధ్యమానామికాగ్రాభ్యా మంగుష్ఠో మిశ్రితో యది, శేషా ప్రసారితా యత్ర స సింహముఖ ఈరితః' 2. కుడిచేత త్రిపతాకహస్తము పట్టవలెను. వీనిచే నృసింహావతారము సూచింపబడును. 3. ఎడమచేత సింహముఖహస్తము. కుడిచేత త్రిపతాకహస్తం సూచించిన నృసింహావతారము. 'వామే సింహముఖం ధృత్వా దక్షిణే త్రిపతాకకః, నరసింహావతారస్య హస్త ఇత్యభిదీయతే' - అభి.ద.

4. గతి ప్రచారములకు ముందువెనుకల నిలబడెడు విధములే స్థానములు. వైష్ణవ-సమపాద-వైశాఖ-మండల-ఆలీఢ-ప్రత్యాలీఢ-అనేవి. వైష్ణవమున రెండు పాదాలనడుమ దూరం రెండున్నర తాలములు (జానలు) వుండవలెను. ఒక పాదం పైకెత్తి రెండోపాదం ప్రక్కగా త్ర్యశ్రము (ఏటవాలుగా) నుంచి, కాలి పిక్కలు అంచితముగా (మడమలు నేలపైనుంచి పాదతలము పైకెత్తి వ్రేళ్ళు చాచి నడమట) అంగము సౌష్టవముగా నుంచవలెను. విష్ణువు అధిదైవతము, సహజాలాపములు - ఉదాత్తములైన అంగప్రదర్శనతో నుండును. శృంగార - వీర - అద్భుత బీభత్స రసప్రాధాన్యం. 5. కుంచితపాదము పైకెత్తి రెండవపాదము ఊరువును మూలము వరకు పైకెత్తి త్రిప్పవలెను. (త్ర్యశ్రము) మోకాలిని నడుమును అల్లే త్రిప్ప వలెను. ఎడమచేత కటకాముఖహస్తము (చూపుడువ్రేలు నడిమివ్రేలు బొటనవ్రేలితో



సవ్యకర ధృతముష్టి సాపేక్ష సారితము [8]
దివ్యతేజః స్ఫూర్తి త్రైవిక్రమార్జితము

చేర్చుట) గొడుగు పట్టినట్లు భావం సూచించి మరొకచేత డోలా హస్తం గాని, పతాకము గాని పట్టుట. ఈ నృత్తమనాదియట। ఇది కరణమును, ఆకాశచారియు —— (పాదోపాంత భుజగ భయ భావితగతి సూచింపును) 8. ఎడమ కుడి చేతులతో ముష్టి హస్తం పట్టుట - 'మధ్యోపరి కృతాంగుష్ఠో ముష్టి ర్ముష్ట్యాకృతికరః' నాల్గు వ్రేళ్ళు అరచేతిలోకి వంచి బొటనవ్రేలు పైన చేర్చుట - తన సుస్థిరత్వాన్ని సూచించును. 'స్థిరే కచగ్రహణే దార్ఢ్యవస్త్వాదీనాం చ ధారణే'

శిరోత్క్షేపక్రియా[1] శిఖర హస్తాంకమ్ము[2]
తరళ నేత్రాంతర త్రస్తదృగ్వలయమ్ము[3]
పాద ఘట్టిత శిరః పాదపీఠతలమ్ము
బాధితాఖిల దనుజ పాతాళకుహరమ్ము
బలిగర్వ నిర్వాణ భావోద్ధృత స్థితిఁ
శ్రీలెల్ల గ్రహియించి శ్రీ వామనాకృతిఁ[4]
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

67

ఆలీఢ పదగతియు[5] నా ధూత మూర్ధమ్ము[6]
సంలగ్న వీరదృగ్జాల[7] నయనాంతమ్ము

**1.** శిరము ప్రక్కగా మీదికెత్తుట. ఇది ఉత్క్షిప్త శిరము. 'పార్శ్వోర్ధ్వభాగ చలిత ముత్క్షిప్తం నామ శీర్షకం' ఇది అంగీకారమున ప్రయోగం. అంగీకార ప్రయోక్తవ్య ముత్క్షిప్తం నామ శీర్షకం' 2. ముష్టి హస్తమున బొటనవ్రేలు చాచి పట్టవలెను 'చా స్మిన్ముష్టి రున్నతాంగుష్ఠ స్స ఏవ శిఖరః కరః' ఇది దానమును గ్రహించుట సూచించును. 'నాఽస్తీతి వచనే దానే ఫలాంశక పరిగ్రహే' - 3. చలించు కన్నులందు విలాసంతో కదులు గ్రుడ్లు కలిగి మీది కెత్తబడిన రెప్పలు గల చూపు 'అంతర్వ్యాకసితా పూర్వం పశ్చా ద్వివరళతారకా, త్రస్తా త్రాసే మదే దృష్టి స్సమోత్వృత్త పుటద్వయా' భయము - మదములందు ప్రయుక్తం - 4 మీదు క్రిందుగా ఎడమ కుడి చేతులతో రెండు ముష్టిహస్తములు పట్టిన వామనావతారము. 'ఊర్ధ్వాఽధో ధృత ముష్టిభ్యాం యది స్థితః, స వామనావతారస్య హస్త ఇత్యభిదీయతే' - అభి.ద. 5. ఇది స్థానము. మండలి స్థానములందలి (రెండు పాదాలు నాల్గు జానల దూరమున నుంచి పాదముల నెత్తి త్రిప్పుచు ప్రక్కగా నుంచి కటి, జానువులను సమంగా నుంచుట) కుడిపాదము - ఎడమపాదము అయిదు జానల దూరమున నుంచి నిలచుట. వీర రౌద్రములను, రోషా మర్షకృత్యములందును - మల్లుల సంపేటము. శత్రు దండయాత్ర శస్త్రప్రయోగములందుపయుక్తము. 6. కొంచెము అడ్డముగా విక్షిం చిన శిరస్సు 'ఆధూతం తు సకృ త్తిర్యగూర్ధ్వనీత శిరోమతం, ఇది సమర్థుడనను గర్వమున నుపయోగం. 'శక్తోఽస్మీ త్యభిమానేచ ప్రయోగ స్తస్య చోదితః' - 7. ఇది రసదృష్టులలో నొకటి, తేజస్సు కలిగి విప్పారినది, ఉగ్రము, శాంతము కానిది.



ఉత్తుంగ సౌష్ఠవ సముజ్జృంభి తాంగమ్ము
మత్తిల్లి కరణాగ్ర శిరోత్తంస భావమ్ము
రాణ్మణీ గళ రక్త రంజిత శిరాగ్రమ్ము
రాణ్మకుట మాణిక్యరాజిత పదాగ్రమ్ము

గంభీరముగా నుండునది. సహజమై నల్లగుడ్లు కలది యగు చూపు వీరదృష్టి. 8. ఇది కరణము. రెండు పాదాలు ఘూర్ణితములు (తిరుగునట్లు) చేసి వానివి ఉపసర్పితములు (దగ్గర చేర్చి) చేయుచు హస్తములు ఉద్వేష్టితముగా (నడుము చోటున నుండునట్లు పైకెత్తి కలిపి) అపవిద్ధముగ (విడదీసి మరల మరల) చేయవలెను. ఇది మత్తస్వభావమును సూచించును.

కైశికన్యాయైక[1] కంఠ నిర్దళితమ్ము
ఆశాంత దీప్తిత భయంకర కుఠారమ్ము
ఒకట సర్పపతాక[2] మొకట కటిపార్శ్వమై[3]
ప్రకటిత శ్రీ పరశురామావతారమై[4]
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

68

సమపాద[5] పద్మాంత సంచరిత భృంగమ్ము
విమలాత్మ దర్శనావిష్కృత బ్రహ్మమ్ము
కరుణార్ద్ర రసభావ కలిత సౌభాగ్యమ్ము
అరివీర హృచ్ఛేద నాకృష్ణ కార్ముకము
కుంచిత భ్రూక్షేప[6] సంచిత సమీక్షణము

1. న్యాయాలు నాలుగు. శస్త్రప్రయోగములందుపయోగము. శత్రు కటిచ్ఛేదనమున భారతి న్యాయము - పాదచ్ఛేదనమున సాత్వతన్యాయము. వక్షశ్ఛేదనమున వార్షగణ్యాన్యాయము. శిరశ్ఛేదనమున కైశికన్యాయము, ప్రయోక్తము న్యాయసమాశ్రితములైన అంగహారములతో రంగస్థలమున యుద్ధములు ప్రవర్తితములగుచున్నవి ఈ న్యాయమున శస్త్రము బొమ్మన గాని, మూపునందుగాని ఎత్తి కొట్టవలెను. భారత న్యాయగతి ప్రచారము (ఎడమచేత డాలు కుడిచేత కత్తి పట్టుకొనుట) రీతిని కత్తి త్రిప్పి శిరమునందే కొట్టవలెను. ఈ శస్త్రప్రయోగము సంజ్ఞామాత్రముగా అభినయపూర్వకంగా ప్రయోగింపవలెను 2. త్రిపతాక హస్తమున చిటికెనవ్రేలు వంచిన అర్ధపతాకము 'త్రిపతాకేకనిష్ఠాచే ద్వక్రితార్ధ పతాకకః'. 3. నడుమునందుంచిన చేయి. 4 ఎడమచేయి నడుమునందుండి కుడిచేత అర్ధపతాకం పట్టిన పరశురామావతారం. 'వామం కటితటే న్యస్య దక్షిణేఽర్ధపతాకః, ధృతః పరశురామస్య హస్త ఇత్యభిధీయతే'. అభి.ద

5. భౌమీచారి. గోళ్ళు సమానంగా నుండునట్లు రెండు పాదాలు దగ్గరజేర్చి నిలచుట. ఇది సమపాదస్థానము కూడా. రెండు పాదాలు సన్నిహితంగా వుండి, స్వాభావిసౌష్ఠవములతో గూడియుండుట. 6. కనుబొమలు రెండూ ఒక్కసారిగాని, పర్యాయముగాగాని, లలితముగా వంచుట. ఇది మొట్టాయిత - కుట్టమిత - విలాస - కిలికించితములందు, శృంగారచేష్టలందు వినియోగము. 'ఏకవాహి ద్వితీయావా,



ప్రాంచత్సమ గ్రీవ[7] మంచితి సలక్షణాము
విశకలిత పతాకమ్ము[8] శకట కరా[9] గ్రమ్ము

కుంచితాంచితవా మతా, మొట్టాయితే, కుట్టమితే, విలాసే కిలికించితే' - 7. స్వభావిక
ముగా నుండు మెడ - ధ్యాన - స్వభావ జపముల వినియోగం. 'సమాస్వాభావికీ
ధ్యాన స్వభావ జప కర్మసు' - 8. విశకలిత మన తారుమారైన దని భావం. పతాక
హస్తములు రెండు చేతులా తారుమారుగ పట్టవలెను. వెంటనే శకటహస్తము
సూచింపవలెను. ఇది రాక్షసులను జయించుట సూచన. 9. రెండు భ్రమర హస్త

విశంకట[1] రావణా విశిర ఘూతాంకమ్ము[2]
ఒక్కట కపిత్థమ్ము[3] నొక్కటః శిఖరమై[4]
రక్కొనః[5] గరములః రామావతారమై[6]

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు,

69

అంచితాంచితపాద[7] సంచారమండలము
సంచారభావాంగ సంచిత శ్రీకరము[8]
భ్రూచతుర[9] విక్షేప పూర్వకము తారకము

ములు బొటనవ్రేలిని నడిమి వ్రేలిని చాచిన శకట హస్తమగును. రాక్షసులు మున్నగు వారల అభినయమున నుపయోగము. 'భ్రమరే మధ్యమాంగుష్ఠ ప్రసారా చ్ఛకటో భవేత్, రాక్షసాభినయే చాఽయం నియుజ్యో భరతాదిభిః' – 1. విశంకట — గొప్ప విస్తృతిగల. 2. విశిరఘూతాంకము + వధించుటకు చిహ్నమైనది. 3. శిఖరహస్తము నందలి బొటనవ్రేలిని ముడిచి దానిపై చూపుడువ్రేలు నంచినది. 'అంగుష్ఠమూర్ధ్ని శిఖరేవక్రితా యది తర్జనీ కపిత్థాఖ్య కరస్యోఽయం తన్నిరూపణ ముచ్యతే' కొంగు మొదలగునవి పట్టుకొనుటలో వినియోగము. 'చేలాంచలాది గ్రహణే' ఇచట వింటిని పట్టుకొనుట సూచించును. 4. ముష్టిహస్తమునందలి బొటనవ్రేలు చాచుట 'చేన్ముష్టి రున్నతాంగుష్ఠ స్స ఏవ శిఖరః కరః' ఇది శక్తి - బాణము, తోమరాది ఆయుధాలు పట్టుటకు సూచనము. శక్తి తోమరయో ర్మోక్షే' - 5. వర్థిల్లు. 6. కుడిచేత కపిత్థ హస్తము. ఎడమచేత శిఖరహస్తము క్రిందు మీదులుగ బట్టిన రామావతారము. 'కపిత్థం దక్షిణే హస్తే వామే తు శిఖరః కరః, అథధోత్తర భాగే తు రామచంద్రకరః స్మృతః' - అభి ద.

7. మడమలను నేలపైనుంచి పాదతలములు పైకెత్తి వ్రేళ్ళుచాచి నడచుట.

8. సంచారి లేక వ్యభిచారి (నిర్వేదాదులు) భావాలతో కూడినదై యొప్పిద మును శుభస్కారము నైనది.

9. రెండు కనుబొమల కూడికతో కొంచెము మెల్లఁగా చలింపజేయునది.



సాచీకృతేక్షణాం సంయోగ మీలితము
కంసాది దానవాఽఖర్వ గర్వోజ్ఝితము

చతురభ్రువు. ఇది ముఖము స్పృశించుట హృదయానందమున వినియోగము. 'ద్వితీయ సహితా ప్రోక్తా స్ఫురితా మద మంధరా, చతురాముఖసంస్పర్శే హృదయానందే చ సంభ్రమే'

4. స్వస్థానమునుండి కడకంటవరకు అడ్డముగా చలించునది సాచీదృష్టి. 'స్వస్థానే తిర్యగాకార మపాంగ చలనక్రమాత్, సాచీదృష్టి రితి జ్ఞేయా నాట్యశాస్త్ర

సంసార జీమూత సంఘ ప్రభంజనము
లలితభుజ శిరస్సమలంకృతాకర్షణము
కలిత వంశ్యాభిముఖ చలిత మృగశీర్షకము[6]
సుందరానంద గోబృందాయమానమై
బృందావన విహార కృష్ణావతారమై[7]
ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

70

పద్మాసన[1]స్థిత ప్రజ్ఞాస్వరూపమ్మా[2]
పద్మబాంధవ దివ్య భాస్సమాన ముఖమ్మా

కోవిదైః' - అభిప్రాయం - మీసం దువ్వట మున్నగువానిలో వినియోగం 'ఇంగితే శ్మశ్రుసంస్పర్శే' -

5. దీన్ని నిమీలితమందురు. సగము తెరువబడిన కన్నులు గలది. వరవశత్వములందు వినియోగం. 'దృష్టే రర్ధ వికాసేన మీలితా దృష్టి రీరితా, పారవశ్యాది భావేషు ప్రయోక్తవ్యా నిమీలితా' -

6. సర్పశీర్షహస్తం (పతాకము యొక్క అరచెయ్యి కొంచెము పల్లముగ వంచినది.) లోని చిటికెనవ్రేలు బొటనవ్రేలు చాచవలెను. అస్మిన్ కనిష్ఠికాంగుష్ఠే ప్రసృతే మృగశీర్షకః' - రెండు చేతుల మృగశీర్షహస్తముల నెదురెదురుగా మోము కడబట్టినచో పిల్లనగ్రోవి నూదుటను సూచించును.

7. రెండు మృగశీర్షహస్తములు భుజ శిరస్సుల సమీపమున నెదురెదురుగ బట్టిన కృష్ణావతారహస్తము. 'మృగశీర్షే తు హస్తాభ్యా మన్యోన్యాభిముఖ కృతే, అంసోపకంఠే కృష్ణస్య హస్త ఇత్యభిధీయతే' -

1. ఎడమ తొడమీద కుడిపాదము కుడి తొడమీద నెడమపాదము చేర్చి శరీరము చక్కగా నిక్కించి కూర్చుండుట. ఈ ఆసనమువల్ల శ్వాసగతి మెల్లనై కుంభక సిద్ధికలుగును. శరీరమున రక్తప్రసారము చక్కగా సాగి సమస్త వ్యాధులు నశించును. 'వ్యాధి వినాశకారి యమినాం పద్మాసనం ప్రోచ్యతే' - యోగ ప్రకాశికలో - 'ఊర్వోపరి సుసంస్థాప్య ఉభే పాదతలే ఉభే, ఋజుకాయః సమాసీన ఇతి పద్మాసనం భవేత్', - అని. 2. నిశ్చలమైన తత్త్వజ్ఞానం కలవాడని భావం. భగవద్గీతలో 'స్థితప్రజ్ఞస్య కాభాషా సమాధిస్థస్య కేశవః స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత



ధ్యానావలోకన నయనయుగ విలాసమ్ము[3]
ఆనంద తుందిలాయత్త హృదయాబ్జమ్ము[4]

ప్రజేత కిం?" అని అర్జునుని ప్రశ్న. ఇందుకు భగవానుడు. కోరికలు వదలి తనలో ఆనందము పొందువాడు- క్లేశము, సుఖాపేక్ష, విషయానురాగం, భయం, కోపం, లేని సుశీలుడు - శుభాశుభములందు వికారములేనివాడు, ద్వంద్వసహిష్ణుడు, జితేంద్రియుడు, విషయవాసనలు లేనివాడు. మనక్షోభకారణములైన ఇంద్రియములను సంయమనమున లోగొని మనసు పరమాత్మయందు నైక్యముచేయువాడు స్థితప్రజ్ఞుడనెను. చూ: గీత 2 అధ్యాయం 3 సర్వచింతలనువదలి నిశ్చలమైన (ఏకాగ్రయమైన) చిత్తముచే ఆత్మదర్శనముచేయుచున్న కన్నుల విలాసమని భావం ధ్యానలక్షణం - 'సర్వ చింతాం పరిత్యజ్య సావధానేన చేతసా, నాద ఏవానుసంధేయో యోగసామ్రాజ్య మిచ్ఛతా' యోగసామ్రాజ్యముగోరి - సర్వచింతలనువదలి మనసు ఏకముగా నిలిపి నాదమును మాత్రమే అనుసంధానించుకొని తనలోతాను చూచుచు ఆనందము పొందుట. 4. ఆనందముతోకూడిన మనస్సు. ఆనందమన బ్రహ్మానందము. విషయ

హితవాక్య భావనాఽహింసోపదేశమ్ము
సతత ధర్మాచరణ సత్క్రియావసరమ్ము
సంఘాభిహిత మహిత సంశ్రయోద్ధారమ్ము
సంఘర్షిత మఖాంగ సాక్షేప శీలమ్ము
ఆ బోధితరుమూల మా భవిష్యార్థమై
బుభుత్సువుగాగఁ దా బుద్ధావతారమై"

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

**71**

విశ్వసంరక్షణావిష్కృత మహోద్యమము
అశ్వాధిరూఢ వీరాధి వీరాంచితము
పాప సంభృత కాల పాశాభివేష్టితము
వ్యాపనోదగ్ర భుజ బలాన్విత మహిమమ్ము

సాధన సంబంధముచే లౌకికానంద మేర్పడును. మానుష, మనుష్య - దేవగంధర్వ - చిరలోకపిత్ర - అజానజదేవ - కర్మదేవ - ఇంద్ర - బృహస్పతి - ప్రజాపత్య హిరణ్యగర్భ ఆనందములని తారతమ్యమునొంది బ్రహ్మానందమగుచున్నది. ఇది బ్రహ్మవేత్తకే అనుభవ సిద్ధము 6. సమముఖము-నిమీలిత నేత్రము-పద్మాసనము నందుండియందు కరములను సంపుటీకరించియుండు అభినయమున బుద్ధావతారము సూచింపవలెను. మరియు కుడిచేత సందంశహస్తము. (అరాలహస్తమునందలి చూపుడువ్రేలు బొటనవ్రేలు ఒకదానినొకటి తాకునట్లు పట్టి అరచేయి పల్లంగా వంచవలెను.) ఇది యోగధ్యానాదులందు-ఉపదేశమునందు వినియోగము. ఎడమచేతను పతాకము ప్రయోగింపవలెను. బుద్ధావతారమును, దశావతారములును చెప్పిన అభినయ దర్పణకారుడు సూచింపలేదు. తరువాతవారును సూచింపలేదు. దర్భా కవిగిరి విచిత్రరాయవతంసుడు రచించిన అభినయదర్పణంలో గ్రహముల అభినయ లక్షణం సూచిస్తూ 'బుద్ధ' - (బుధ) అభినయం చెప్పాడు. అది ఈ భావానికి సరిపడదు.

ఇతడు చెప్పిన నూటయిరువది యభినయాల్లో దశావతారములు లేకపోవుట విచారకరము. రామ, నృసింహ, వామన అభినయ లక్షణములున్నవి.



ధర్మాభిహిత సముద్ధరణావకాశమ్ము
మర్మ విచ్ఛేదనామత సమత భావమ్ము
కరవాల భీకరాకర మహోత్పాతమ్ము
అరివీర కంఠార్పితాంఘ్రి సరసీజమ్ము
వలకేల పతాకము[1] మలునఁ ద్రిపతాకమై[2]

1. అన్ని వ్రేళ్ళను చాచి బొటనవ్రేలిని వంచి పట్టవలెను. ఇది ఆశ్వ, ఖండన, వాయు, శయన, గమన, ప్రతాప, ప్రసాదాదులందు వినియోగము. ‘తురగే ఖండనే వాయౌ శయనే గమనోదితే ప్రతాపే చ’ అభి. ద.

2. పతాకహస్తమున ఉంగరపువ్రేలు వంచుట - ఇది ఆయుధము నెత్తుట

కలియంగా భావిగత కల్యాణవతారమై*
ఆడెనమ్మా! కృష్ణుడు
పాడెనమ్మా! విష్ణువు.

## 72

ఆ రాత్రిక శిరమ్ము[1] నలరించి యొకసారి
వీర దృగ్విలసితము[2] వెలయించి యొకసారి
పరివర్తిత గ్రీవ[3] భంగమ్ము నొకసారి
పరివృత్తిత ప్రాణ[4] కరచలన మొకసారి
రేచిత భ్రూ[5] భంగ రచనమ్ము నొకసారి

యందు వినియోగము.

* కుడిచేత పతాకహస్తము - ఎడమచేత త్రిపతాకహస్తము పట్టినచో కల్యాణవతారము. 'పతాకో దక్షిణే వామే త్రిపతాక కరో ధృతః, హస్తః కల్యాణవతారస్య ఇతి నాట్యవిదో విదుః' అభి. - ద.

1. మూపులందు కొంచెం తాకించి త్రిప్పబడు శిరస్సు. 'సందేహ కించి దాక్షిణ్య భ్రాంత మారాత్రికం మతం' -ఆశ్చర్యం, ఇతరుల అభిప్రాయమెరుగుటలో నుపయోగము. 'విస్మయే దృశ్యతే తచ్చ పరాభిప్రాయ వేదనే' 2. వీరదృష్టి - ప్రకాశవంతమై, విస్ఫారితమై కోపము శాంతము కానిదై, గంభీరమైనదై సమతార కలది. 3. ఎడమ కుడివైపులకు అర్ధచంద్రాకారంగా కదలింపబడు మెడ. 'సవ్యాపసవ్యాగ్రీవా యత్రార్థచంద్రవత్, సాతు నాట్యకలాభిజ్ఞై ర్నిజ్ఞేయా పరివర్తితా' శృంగార నటనమున స్త్రీ చెక్కిళ్ళు ముద్దిడుకొనుటలో వినియోగము' శృంగారనటనే కాంతా కపోల పరిచుంబనే' 4. నాట్యము చేయునపుడు ప్రక్కల నుండి ముందువైపునకు చేతులను తెచ్చుట. ఇది హస్తప్రాణముల పం(ద్రెం)డులో నొకటి. పరివృత్తిత ప్రాణము. 'పార్శ్వం చ పురోభాగే యో హస్తో నటనే కృతః, పరివృత్త సమాఖ్యాతో నామ్నా హస్త విశారదైః' 5. అందంగా, ఇంపుగా, ఒక కనుబొమ పంచుట. ఇది రహస్యము వినుట, మంచిదనుట, స్థాన వీక్షణములందు వినియోగము. 'లావణ్య మధురాక్షిప్తా యద్యేకా రేచితా మతా,

## 87

రేచిత కర[6] విలాస సూచన మ్మొకసారి
త్రికచలిత కటి[7] తట ప్రకంపన మొకసారి
ప్రకటితోరూద్వృత్త[8] వికటిత మ్మొకసారి
క్షిప్త జంఘాక్రమాక్షిప్తమ్ము[9] నొకసారి
లిప్తారుణ ప్రభాఽలీఢ పద మొ[10]కసారి

ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

## 73

సరగునన్ వృత్తమున జ్వాలప్రభల్ రేఁగ
నెఱికురుల ముడిలోన నెలవంక వడిసూఁగ
మిత్ర చంద్రాగ్నులా నేత్రముల వసియింప
చిత్ర కుండల కాంతి పత్రి కమ్మల[1] నింప
చతుర్భుజ సమన్విత గతి జగతి గడియింప
ధృతఢమర శబ్దమ్ము దివ్యాగ్నిఁ జలియింప
స్థితిచిహ్నహస్తమ్ము చెలఁగు డోలకరమ్ము
స్థితిపదాంకమ్మఽధస్థితాసుర సంగతము

రహస్య శ్రవణే సాధు కలనే పదవీక్షణే' 6. ఇది నృత్తహస్తము. రేచితహస్తము. ద్రుతభ్రమణముగల రెండు హంస పక్షముల అరచేతులు వెలికలగానున్నచో నది. ఇది చేతుల రెంటను ప్రయోగింపవచ్చు. 7. త్రిక చలితకటి — తొడ ఎముకలు రెండు, వెన్నెముకయు కలియుచోటు త్రికము. దీనితోడి చలించు నడుము - అని. 8. మీదికి త్రిప్పబడిన తొడలు. 9. పిక్కలను విసరుచు నడచుట 'క్షిప్తజంఘ' ఇది వ్యాయామ తాండవముల ప్రయుక్తము ఆక్షిప్తమన వేగంగా నాడించుట. 10. కుడికాలు చాచి నిలుచుట - చూ: 67 వ పదము అధోపీఠిక. ఇది స్థానము.

1. చెవులయందు కమ్మలుగా ధరించిన బిల్వదళములు.

తతకుంచితోత్పాద గతి దయాప్రసరమ్ము
నతి సంచలిత కటిన్ నటరాజ భంగిమము[2]
లాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

74

భుజగాంచితక[1] రీతి పోహాణింపంగ నిల్చి
భుజములన్ శిర మొగ్గి భ్రూక్షేపమునం బొల్చి

2. ఇందు నటరాజ తాండవ స్వరూపార్థము. చుట్టునున్న జ్వాల ప్రభా మండలము (వృత్తము) సర్వనాదాత్మక ఓంకారమునకు - జటాజూటమున గంగ సంపత్సమృద్ధికి - చంద్రరేఖ అనుగ్రహానికి, కాలమున కధిపతిగ సూచనము. త్రినేత్రములు సూర్యచంద్రాగ్నులకు, త్రికాలములకు చిహ్నములు. మూడవనేత్రం జ్ఞానచిహ్నం - కుడిచెవియందు మకరకుండలము, ఎడమ చెవియందు తాటంకము ఉండుట, పురుష - స్త్రీ అభరణధారణవలన అర్ధనారీశ్వర సూచనము - సర్ప ధారణమున సర్పము కుండలినీశక్తి చిహ్నము - జందెము పవిత్రతకు, సర్వకర్మాధి పత్యమునకు గురుతు - నాల్గుచేతులలో పై కుడిచేతిలో ఢమరుకము సృష్టికి, శబ్ద వ్యాపకమునకు చిహ్నము. క్రింది కుడిచేయి అభయ హస్తమును, స్థితి చిహ్నము - పై యెడమచేయి అగ్నితో కూడినది. సంహార చిహ్నము - క్రింది యెడమచేయి డోలాహస్తము, అనుగ్రహసూచకము - రెండు పాదాలలో కుడిపాదము స్థిత పాదము, జయ సూచకము - దానిక్రింద రాక్షసుడు రోగ, జరా, మృత్యు, అజ్ఞాన చిహ్నము. వీనిని అణచుట - జయించుటకు చిహ్నము. ఎడమపాదము. కుంచిత పదము. అనుగ్రహానికి, మోక్షానికి గుర్తు - గజచర్మము, పిక్కలమీది గజ్జెలు వీర చిహ్నములు - ఈ పరమేశ్వర తాండవరూపము పంచక్రియాశక్తికి (సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహములకు వీనికర్తలైన అధిదేవతలు - బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులు) చిహ్నము నటరాజ చిత్రము చూడుము.

1. ఇది కరణము - పాదములతో భుజంగ త్రాసచారిని, (కుంచితపాదము - అన మడమ పైకెత్తి వ్రేళ్ళు పాదమధ్యమున ముడుచుట) రెండవ పాదముయొక్క యూరు మూలమువరకు పైకెత్తి కటి. జానువులను త్ర్యశ్ర ఊరువును వివర్తితము చేయుట - ఇది భుజగభయ సూచితము. కుడిచేత రేచితహస్తము (పైకెత్తబడిన

## 89

వలన తారక[2] కాంతి వర్తింప నల్గడల
చలితాధరమ్మునఁ జిలిపి నవ్వులు వెడల
వలకేల కర్తరీ[3] జెలుఁగు కన్నుల జార్చి
మలికేలి నుదరమున నలపల్లవముఁ[4] గూర్చి
లలితకటి నివృత్త[5] మ్ములరఁగాఁ బ్రకటించి
తల సంచరిత పాద[6] చలనమ్ము గావించి
భావానుభావముల నవరసాలంక్రియల
దేవతల్ భక్తిఁ బ్రార్థింపఁగా సన్నుతుల

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 75

నెమ్మిపురి విప్పినటు నెత్తమ్మి విరిసినటు
క్రమ్ముమబ్బులయట్టు క్రొమ్మించు మెఱుపులటు

చేయి) ఎడమచేత 'లతనృత్యహస్తము' (రెండు పతాక హస్తములను పార భాగములందు అడ్డంగా చాచుట) చూపవలెను.

2 కనుగ్రుడ్లు ముక్కోణంగాఁ ద్రిప్పుట. 3. కర్తరీముఖము - అర్ధపతాకములో చిటికెనవ్రేలు, చూపుడువ్రేలు వెలుపలికి చాపవలెను. 'అస్యైవచాపిహస్తే తర్జనీ చ కనిష్ఠికా, బహిః ప్రసారితే ద్వేచే త్స కరః కర్తరీముఖః' ఇది కడకన దొంగలించుట మున్నగువానిలో ప్రయోగము. 'లుంఠనే నయనాంతే చ'.

4. ఇది నృత్తహస్తము. హస్తములు చలించుచున్న వ్రేళ్ళు కలిగియుండు

5. వివృత్తకటి - నడుము పరాఙ్ముఖముగ నుండి అభిముఖముగ మరవలెను. లేక కటియొకవైపునుండి మఱొక వైపునకు త్రిప్పవలెను.

6. దీన్ని అగ్రతల సంచర మంటారు. మడమ పైకెత్తి వ్రేళ్ళు నేఁ చాచి కాలి బొటనవ్రేలితో ముందుకుసాగుట - ఇది ప్రేరణ, పొడుచుట, విలుచ పీడించుట, నేలపై కొట్టుట, తిరుగుట. నిక్షేపాదులందు వినియోగం. 'స్యా దగ్రసంచారీ సవిక్షేపే వికుట్టనే, ....' నృ. ర.

## 90

ప్రాఁకు తీవియలట్లు లాకు లల్లాడినటు
చోఁకు చిఱుగాలులటు రేకు లూడిపడినటు
తేఁటి తేనానినటు గూఁటి గువ్వడిఁగి నటు
మాటుకొను లేటియటు పోటుకొను సింగమటు
సెలయేరు జారినటు చలువరా ల్గరగినటు
కలువపూల్గులుల్కినటు కలికి వలపొలసినటు
జిలుఁగు కన్నులలోనఁ జిక్కశిల్ మెఱయఁగా
ఘులుఘుల్లునన్ గాళ్ళ గజ్జియలు మ్రోయఁగా

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 76

చెలువ కనుపాపలోఁ గులుకు తళ్కులు వెల్గ
కలికి చెల్వైన నుబ్బి గబ్బి గుబ్బలు పుల్క
పోలఁతి వదనమ్ములో వలపు నవ్వులు పర్వ
నెలఁత హృదయమ్ములోఁ దలఁపు పువ్వులు నిల్వ
వెలఁది ముత్తెఁపు దండ జలద కాంతులు నిండ
చెలి సౌరు నూఁగారు చెలిమి కలిమిని దండ
సతీమణి మొలనూలు జారి తొడలను నాడ
అతివ నూపుర రుతుల్ అడుగులను బారాడ
వేమరులఁ దసరూప లీలాకృతులు గొల్ల
భామలున్ భావింపఁ బాముసై నల్లల్ల

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 77

కాఱు మబ్బుల మెఱపు కన్నియలు నవ్వఁగా
మేరు భూధర శిఖర వారమ్ము నొవ్వఁగా
వెల్లుతో రేవెల్లు వెలసి క్రీడింపఁగా
ఘల్లలుగ జ్జియలు కలిసి వెలయింపఁగా
కూనిరాగము దీసి కోయిలల్ బాడఁగా
ఊని పురివిప్పుచు మయూరి నటియింపఁగా[1]
రెక్క లల్లన నిక్కి రెక్కలాడింపఁగా
పక్కి జంటలు చొక్కి మక్కువన్ గూడఁగా
గోపికా మధురిమలు కోరికలు పెంపఁగా
గోపికావళి హృదయ గోపనము సేయఁగా

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

## 78

నింగిపై కెగఁబ్రాఁక నిక్కి నిగ్గులు గురియ
వంగి పాదము దాఁకి పత్రములు[2] వడి విరియ
సరసర నొ్నిండొండు సాపేక్షముగ నిలువ
బిరబిరన్ జిలిపిగా జరిగి చిక్కఁగఁ బరవ
అడుగుదమ్ముల వెలుఁగు లలరు చెక్కలఁగొల్వ
మడఁగి మఱిమఱి యేమొ మాటాడినటు నిల్వ

1. ఆడనెమలి నటించెననుటకు - 'నిర్ఝరాంభః కేళి నీలకంఠాంగనా తాండవాడంబర దర్శనంబు' - అని హరవిలాసంలో, శ్రీనాథుడు. 5 ఆ. 38 ప.

2. గజ్జె కిరుపై పులనుండు చెంపలు.

మూఁగ సైగలవెన్నొ ముద్దుగా మొరయంగ
వేగమ్ములో నాట్యవిన్యాస[3] ముప్పొంగ
నీలిసూత్రమ్ములో నెటె నూరు గజ్జియలు[4]
వ్రేలి చిఱుకాలిపైఁ వెడలింప ఘల్ఘలలు
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

79

సిగలోన విరియించు శృంగారపున్ బూవు
మొగములో మొలతెంచు ముద్దు హాస్యపుఁ బ్రోవు
కనులలోఁ గనుపించు కరుణార్ద్రభావమ్ము
అనుభావ మలరించు నావీర తేజమ్ము
ఉద్రేకితస్ఫూర్తి రౌద్రాంకమై వెలయు
భద్రస్వరూపమ్ము భయదాంకమై తెలియు
విషమ జీవితమెల్ల బీభత్సముగ రేఁగ
విషయేంద్రియాసక్తి పీడ నద్భుతముగా

3. నాట్యవిన్యాసక్రమము: నాట్యకారుడు కంఠముచే గానము, హస్తాభినయముచే గానముయొక్క యర్థమును, కన్నులచే నందలి భావాలను, కాళ్ళతో తాళాన్ని, నడుపవలెను. 'కంఠే నాఽఽలంబయే ద్గీతం హస్తేఽనార్థం ప్రదర్శయేత్, చక్షుర్భ్యాం దర్శయే ద్భావం, పాదాభ్యాం తాళ మాచరేత్' అని. 4. గజ్జెలు, కంచుగాని, రాగిగాని, వెండిగాని యుండవలెను. మంచి శబ్దము నీయవలెను. అందముగా నుండవలె. చిన్నవిగా నుండవలె నక్షత్రాధిదేవతలు గల ఆ గజ్జెలు నల్లదారంలో గ్రుచ్చి గజ్జ గజ్జకు ముడివేయవలెను. నాట్యకారుని కాళ్ళకు ఒక్కొక్కదానికి ఇన్నూరుగాని, నూరుగాని గజ్జెలుండవలె. 'కింకిణ్యః కాంస్యరచితాః తామ్రేణ రజతేన వా, స్వనురాశ్చ సురూపాశ్చసూక్ష్మా నక్షత్రదేవతాః బద్ధయే న్నీలసూత్రేన గ్రంధిభిశ్చ సమన్వితం, శతద్వయం, శతం వాపి పాదయో ర్నాట్యకర్మణి, శతం వా దక్షిణేపాదే ద్విశతం వామపాదకే,. ఈ పదమునందు పాద చలనమువలన నేర్పడు కింకిణీవిన్యాసము సూచింపబడినది.

సర్వరస గర్భమై శాంత రూపము వెలయ
సర్వేశుండై జగతి సంరక్షణము సేయ
నాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు

80

పుడమితో నింగి దోబూచు లాడెడు చోట
కడలితో భూదేవి కలిసి యుండెడు చోట
పిల్ల తెమ్మెర యుల్ల మల్లుకొనియెడు చోట
చల్లఁగా వెన్నెలలు జల్లులూరెడు చోట
పూవులోఁ దావులుప్పొంగి పొరలెడు చోట
గోవులున్ వత్సముల గోము చూపెడు చోట
కన్నులన్ నును వెల్గు చెన్నొంది పడుచోట
చిన్నిపాపఁడు ముద్దు చిఱునవ్వు లిడుచోట
పదబంధముల దివ్యభావ మందెడు చోట
సుదతి కెమ్మోవిలో సొంపు నింపెడు చోట
నాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు

81

సంజకెంజాయలున్ జగతి నిండెడువేళ
పుంజుకొను వెల్గులున్ బుడమిఁ బ్రాకెడు వేళ
తారకలు తళతళలఁ దారాడు నవ్వేళ
వారిధరములు సలిలధార లుమిసెడువేళ
కలువకన్నెలు నిక్కి వలపు లొలసెడువేళ
కలికి కన్నులఁ జిల్కు తలఁపు దెల్పెడువేళ

చిన్నారి చిఱునవ్వు చేర్చి కూర్చెడు వేళ
కన్నె మనసున కోర్కె చిన్నెలుంచెడు వేళ
బిగియారు కౌఁగిళ్ళ బిగువు చూపెడు వేళ
మగువ మమతలఁ జిక్కి మరులు గొల్పెడు వేళ
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

82

మేలి ముసుఁగునన్ మో మోలమాస గొనంగ[1]
నీలాలకల మిసిమి నెన్నొసట ముసలంగ
కలికి చూపులలోనఁ గాటుకలు బింబింప
మొలక ముక్కున నత్తు ముచ్చటలు బచరింప
చిలిపి నవ్వుల పూలు చిన్న పెదవులఁ బూయ
తళుకు చెక్కిళ్ళపై బెళఁకు కమ్మలు రాయ
గబ్బిగుబ్బలు చెలిమి నబ్బుకొన విరిదండ
గొబ్బునన్ సిగ్గొలయఁ గోరుచున్ హారియండ
పల్లవీ కాంతలటు వందనము గావింప
సల్లలిత కటాక్షాఽఽసారమ్ము ప్రసరింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

83

గోపికాధర పాన గోష్ఠ్యర్థ మెఱుఁగఁగా
గోపికా కుచకుంభ కుంకుమలు గూర్పఁగా

1. ఓలమాసగొను: తిరోహితమగు - మఱుగుపడు. 'అని విచారించుచుండె వయ్యవనినాథు డంతకయమున్న నలువిగా నతని నెఱిఁగి యెదురు గద్దియ డిగ్గి పృథ్వీశతనయ యవనికాంతరమున నోలమాసగొనియె' - నైషధం - శ్రీనాథుడు.

ఉపగూహనమ్ముల న్నబ్జాత లూగింప
ఉపచర్యలన్ దన్వి నూరార్చి యలరింప
గోపికాముఖకుముద రూపాంశువులు వెలయ
గోపాల భృంగ ప్రగుంఫిత రజమ్మెగయ
నోటితో నూఁదగాఁ దోటి బోటులుగాంచి
కుటిలభ్రువుల్ గదలఁ గోపమ్ము వెలయించి
వ్యపదేష్ట వీవంచుఁ బరిభవమ్మునఁ బొదల
ఉపదేశములఁ దన్ను నుత్సహించిన యటుల
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

84

బృందావనమ్ములో సుందరీమణిఁ జేరి
పొందుగ్గై కొనఁగోరి యందముగఁ కన్గిరి
అడుగులో నడుగిడుచు నట్టిట్టుఁ దారాడి
ముడుఁగు మొగ్గలు గిల్లి మోముపై పడఁదాడి
ఈలవేయుచు వ్రేల నిటనుండి రమ్మనుచు
గోలచేయకు మనుచుఁ గోపమ్ము విడుమనుచు
సైగలన్ సొగసుగా సవరించి మురిపించి
మూఁగు ముంగురులెత్తి ముద్దుగా ముద్దిచ్చి
బిత్తరిన్ దత్తరమ్మొత్తఁగా నెత్తుకొని
గుత్తంపుఁ బూపొదల గుట్టుగా హత్తుకొని
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

85

''ఓ పిల్ల! ఏమిటే? ఓర చూపావైపు
ఏ పడుచువాఁడుండె? నేమింత నీ కైపు?

96

నీ వీపు సెలగోల నిట్రించి పట్టింతు
నీ వేల మేల!'' న్న నా విభున్ దూఱెత్తు
''చో మామ! అటుచూడు నీ మూపుపై నుండు
పూముళ్ళ గొంగడిన్ బురుగొకటి ద్రేలాడు
బుద్ధిపాడాయె'' ననఁ బొలఁతి; — మగఁడు బెగడున
దద్దరిలి గొంగడిన్ దవ్వుపైఁ ద్రోసినన్
ముసుఁగువడి దానిలో ముడిఁగి యది మూలఁబడ
'హాసుక త్తైవె!' యంచు ముసుఁగులో ముద్దులిడ

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా విష్ణువు.

86

ఒంటిపై దువ్వలువ నూడ్చి నూనియ రాచి
అంటుకొని నీరాడ నొంటిగా నది చూచి
అవ్వలువ కాఁజేసి యటు దాఁగికొని యుండ
నవ్వులాటలఁ దేల్పఁ బువ్వుబోఁడులు గూడ
న త్తిన్వి నునుసిగ్గు బిత్తరమ్మొత్తఁగా
గుత్తుకొని కూర్చుండి కోరికన్ దెలుపఁగా
ఆ చీర విసరిపడి యందఱన్ ముసురుకొన
దాఁచుకొని యుంచువడి[1] తబ్బిబ్బు గ్రబ్బుకొన
నీలిమబ్బున వెలుఁగు నిల్చు వితమున నెదుట
లోలాక్షికిన్ దాను బాలుఁడై నిలిచి యట

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. కట్టుగాపడుట.

87

కుంభ స్తని! నీకుఁ గోపమ్మ దేల నే?
కుంభగత నవనీత సంభృతాత్ముఁడ నే!
కమలాక్షి! నీకింక కలికితన మేల నే?
కమల కోమల కాంతి క్రమవీక్షణుఁడ నే!
సుందరీ! నీకింత సొగసు పొగ రేల నే?
సౌందర్య హృదయారవింద మందిరుఁడ నే!
మత్తకాశిని! నీకుఁ దత్తర మ్మేల నే?
సత్తుచిత్తుల నవ్యచిత్తమ్ములోన నే
కైవల్య సౌభాగ్య కారణం బెన్న నే
దేవుఁడని; దివ్యసందేశమ్మునన్ దానె

ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

88

మోట్టాయిత[1] మొక్క ముద్దుగు మ్మొనరింప
కుట్టమితమును[2] నొక్క కోమలియుఁ బ్రకటింప
ప్రాగల్భ్యమున[3] నొక్క భామినియుఁ గోపింప
ముగుద భావము[4] నొక్క ముద్దరా ల్వెలయింప

1. ప్రియుని కథ వినుట మున్నగు సమయముల వతవియందు మనస్సుంచి, చెవి గోకికొనుటయను స్త్రీ శృంగారచేష్ట. 2. కొప్పు చన్నులు. మోవి, మున్నగువవి గ్రహించి పీడించుచున్నపుడు ఆనందము పొందుచున్నను. కోపమున తల. చేతులు విదలించుట యను స్త్రీ శృంగారచేష్ట. 3 నిర్భయముగా వ్యవహరించుట యను స్త్రీ శృంగారచేష్ట. 4. నవయౌవన - తనకు బాగుగా తెలిసిన దానినే తన ప్రియుని కడ

కౌతూహల మ్మొ[5]క్క కామినీమణి జెంప
కీలిలోఁగాంతి[6] నొక నాతి యింపులు నింప
కేళీ[7] వినోద మొక కిసలయాధర చూప
హేలా[8] విలాస మొక లీలావతియుఁ దెలుప
దాక్షిణ్య భావములఁ దరుణులన్ ప్రేమింప
దక్షిణుండై[9] తాను ధర్మమ్ము పాలింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

89

అలుకతో సతిప యటు లోలయు మొగమును ద్రిప్పి
పలుకకుండిన – "ముద్దు పలుకుల న్నను దన్పి
హూరుసింపఁ గురులెల్ల సరిచేసి ముడివేతు
విరులు నీ సిగలోనఁ దురిమి నిన్ మురిపింతు
తళుకుఁ జెక్కుళ్ళపై జిలుఁగు మకరిక లుంతు
కలుకు పెదవుల లత్తుకల నొత్తి మెప్పింతు
గుత్తంపు గుబ్బలను గుంకుమలు గుప్పింతు
జొత్తుకొని హత్తుకొను జోడు కోకల నిత్తు
అడుగులను పారాణి యద్ది యొద్దిక గూర్తు
అడలఁబెట్టను" మంచు నడుగుకొని తానెత్తు

తెలియునట్లు ప్రశ్నించుట - యను స్త్రీ శృంగారచేష్ట. 5. అందమగు వస్తువును చూచుటయందు కలుగు మిక్కిలి కోరిక యను స్త్రీ శృంగారచేష్ట. 6. రూప, యౌవన. లాలిత్య, భోగాలవల్ల అవయవములకు సొంపునగల్గు ప్రకాశము - అను స్త్రీ శృంగారచేష్ట. 7. ప్రియునితోడి విహరించు క్రీడ - అను స్త్రీ శృంగారచేష్ట. 8. భ్రూ నేత్రాది వికారాలచే సంభోగేచ్ఛ తెల్పు వికారభావము విడువక యుండుట యను స్త్రీ శృంగారచేష్ట. 9. అనేక స్త్రీలయందు సమానమైన ప్రేమ గలవాడు - దక్షిణ నాయకుడు. 'తుల్యోఽనేకత్ర దక్షిణః' - ప్రతాపరుద్రీయమ్.



లాడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

౧౦

బిబ్బోకవతి యొకతె గొబ్బునన్ గడవగొని
ప్రబ్బుకొను నూహలన్ బయనించు వలపుగొని
మడువులో నడుగిడగ నొడిసెఁ బావడ సీరు
ముడిఁగెఁ గుచ్చెళ్ళలోఁ దడితడిగ జలతారు

బుడుబుడుంగని మునుఁగు బుంగపైఁ దా వంగ
విడిసిపడు పయ్యంట నొడిసిపట్టిన "సంగ
డీఁడెవ్వఁ డిట! నీట నెట్లుండె!" నని చూడ
"వీఁడె నల్లని వాఁడు - తోడైన నీవాఁడ——"
ననఁగ నక్కునఁ జేరి యనురాగ గరిమమున
మునిపెదవి స్ఫురితక[1] మ్మొనరింపఁ దమకమున
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

91

తోడి సతులంతంతఁ దోడ్తోనఁ దన్ గలయ
వేడుకొని పొమ్మనుచు వెలఁది వలపున నలయ
హారమునన్ వారు పరిహాసమ్ములన్ నొంప
నటఁగూడి పోకున్న నది గాంచి కిసురింప
రోషామణీ వేష మొయ్యార మొలుకఁ బరి
తోష మింపారఁ దాఁ దొయ్యలుల దరిచేరి
రోష గుంఫిత కఠిన భాషలన్ బలుకుచున్
మృష భావములఁ దన్ని మేలమ్ము లాడుచున్

1. 'లలాటాలక కపోల నయన వక్షః స్తన ఓష్ఠాంతర్ముఖేషు చుంబనం' అని ప్రీని ముద్దుపెట్టుకొనేచోట్లు నొసలు - ముంగురులు - బుగ్గలు - కళ్ళు - వక్షము - స్తనాలు - పెదవులు - నాలుక - ముఖ్యములని సూచించారు. - కొందఱు 'ఊరు సంధి బాహు నాభిమూలేషు లాటానాం' ....అని తొడలు, గజ్జలు, భగము, మున్నగునవి ముద్దుపెట్టుకొనేచోట్లన్నారు. కాని, అవి శిష్టులు చేయదగినవికావు. - ఇట ప్రియుఁడు తన ప్రియురాలి వదనంలో (పెదవులలో) తన క్రింది పెదవి ప్రవేశింప జేసినపుడు, దాన్ని ప్రియురాలు సిగ్గుతో జంకుతూ గ్రహించి క్రింది పెదవి కదిలించాలి - పై పెదవి కదలింపక యుండాలి. దాన్నికూడా కదిలిస్తే - గ్రహించినట్లే - అదే స్ఫురితకం.

హుషారుగ నడిరేయి నొయ్యారిఁ గలిసికొని
మిషచూపి రమ్మనుచు మెల్లఁగాఁ బొదువుకొని
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు

92

ఝళఝళత్కటక సంచలిత చరణమ్ములన్
ఘళఘళత్కంకణ క్వణ కలిత కరములన్
ఝర్ఝరీ విన్యాస శబ్దగత విధములన్
ఘూర్జరీ రాగ[1] ప్రగుంఫిత స్వరములన్
చంచల పింఛాగ్ర సంజనిత కాంతులన్
ప్రాంచన్మణీహార మండితాంగమ్ములన్
సస్మితాంకిత మధుర సంభాషణమ్ములన్
విస్మితాలోకనావిష్కృత క్రమములన్
లీలావిలాసానుశీలనాత్మక కేళి
బాలా మనోభావ లోలాత్ముఁడై హేళి
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

93

అతులితానందమున నా తల్లి యొడిలోన
నాతురత వెలయఁగా నడఁగి పయ్యెటలోన
గుటుకు గుటుకని పాలు గుడుచుచున్ జన్నులన్
బుటికితముగ నొత్తుచున్ బొల్పారఁ జేతులన్

1. శుద్ధమధ్యమజన్యరాగములలో మాయామాళవగౌళ రాగజన్యము 15 వ మేళకర్త. 'సరిగమపదనిస - సదనిపమగరిస' అనేవి ఆరోహణ అవరోహణ స్వరాలు. శుద్ధఋషభము - సాధారణగాంధారము - శుద్ధమధ్యమము - ప - శుద్ధ దైవతము - కాకలినిషాదములు స్వరస్థానములు.

గ్రేఁగంటి చూపింత క్రేవలన్ బ్రసరింప
మాగన్నుసన్ నిద్ర మాయలన్ మాయింప
పాంచజన్యము నెత్తి పట్టి పూరించినటు
సంచలిత దేహమున సంభ్రమము గూర్ప నటు.
భావిగత సంభావ్య భావమ్ములో నిలుప
కేవలుండై తాను గీతార్థముల్ దెలుప

ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

## 94

హరుసమున నాహరుఁడు హరికి నంజలి[1] గూర్ప
పరమేశ్వరునకు హరి భక్తితోఁ గైమోడ్ప
పరతత్త్వమద్వైత భావమ్ము హృది నింప
భరతముని యాత్మలో బ్రహ్మమ్ము వీక్షింప
సంగీత సాహిత్య సర్వస్వ మర్పింప
అంగాంగ భంగి నాట్యాంగముల్ సవరింప
విశ్వసంశ్లేషైక విజ్ఞాన మలరింప
విశ్వాత్ముఁడై నిలిచి వినదారి మదినొంప

1. అంజలి:— రెండు పతాకహస్తముల నరచేతుల జేర్చినది. ఇది దేవతలకు మ్రొక్కునపుడు తలపై కూర్చవలెను. గురువులకు మ్రొక్కునపుడు ముఖమునకు చేర్చవలెను. సమానులకు బ్రాహ్మణులకు మ్రొక్కునపుడు రొమ్మునకు చేర్చవలెను. కోపమున - పరిహాసమున నీ నియమంలేదు 'పతాకతలయో ర్యోగా దంజలి కర ఈరితః' – 'దేవతా గురు విప్రాణాం నమస్కారేఒప్యనుక్రమాత్, వార్య శ్శిరో ముఖోరస్సు వినియోజ్యోఒంజలిః కరః' – అభి. ద. పతాకతలయో శ్శ్లేషాదంజలిః ప్రణతౌ క్రమాత్, భూదేవ గురు దేవానాం పతోవక్త్రి శిరః స్థితః క్రోధే చ పరిహాసే చ నాస్త్యయం నియమః పునః' - నృత్త రత్నావళి.

పదఘట్టనన్ నృత్యభంగిమలు వెలయింప
సదయాంతరంగమున సర్వమ్ము పాలింప
నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

95

అక్షరమ్ములు గూర్చి యందమ్ము సవరించి
లక్షణము లక్షించి లాలిత్యమును బెంచి
శబ్దార్థములు[1] నించి వ్యాకృతులు[2] నిబడించి
వాక్యమ్ము నిర్మించి వార్తికమ్ముల[3] నెంచి
చిత్ర[4] బంధము[5] లుంచి శిల్ప[6] కల్పన[7] లెంచి
పాత్రౌచితిన్ మించి పరమార్థమును గాంచి
నవరసమ్ముల ముంచి నవభావములు బంచి
కవనమ్ము సాగించి కావ్యమ్ము గ్రథియించి
నియమమ్ము నియమించి నీతిమార్గము నెంచి
శ్రేయమ్ముగోరు కవి శేఖరుని మదిదోఁచి
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

1. శాస్త్రాదులచే సాధింపబడిన యర్థములు. 2. వ్యాకరణాదులు. 3. ఉక్త - అనుక్త - దురుక్తములను దెలిపే విధానము. తాళమార్గమందలిది. దక్షిణము, వార్తికము. చిత్రము. చిత్రతరము, చిత్రతమము - ఇవే మార్గప్రాణములు. 'ఉక్తానుక్త దురుక్తానాం చిన్తా ప్రవర్తతే - తంగ్రన్థం వార్తికం ప్రాహు ర్వార్తికజ్ఞా మనీషిణః', అని - వార్తిక మనగా వృత్తివివరణం వృత్తివ్యాఖ్యానం అని భావం' వ్యాకరణ శాస్త్రప్రవృత్తి వృత్తి - వార్తికకారుని వాక్యగారుడనే వ్యాకరణ శాస్త్రజ్ఞుల వాక్యము. 4. చిత్రకవిత్వము. ఇందు వృత్తగర్భితములు, పద్మ, చక్ర, నాగ, బంధాదులు యమక భేదగోపనములు గల కవిత్వము. 5 బంధకవిత్వము-పద్మ, చక్ర నాగ, బంధాధులగల పద్యరచన. 6. సాహిత్ ప్రక్రియల దీరిన సౌందర్య విలాసము - ఇందు అంశము, అర్థము, రసము, ప్రాధాన్యమై, రమణీయమై ఆత్మానుభూతిని కలిగించు శోభ. 7. కథాసంవిధానము - కథా నిర్మాణములోని చాతుర్యము.

96

భుజంగాంచిత కరణ[8] పూర్వక స్థితి పాద
భుజంగ త్రాసచార్యో[9] జ్వలోన్నత పాద[10]
ములరంగ నూపురమ్ముల ఘల్లు లాదవము
లల లతాహ స్తమ్ములన్[11] గంకణాస్వనము
లలిత లలితమ్ముగాఁ జలియింప పెంచమ్ము
లలిత దృగ్వి[12] లసితాలోల ముఖకమలమ్ము
ఉద్వాహితముగఁ గటి[13] నుంకించి యురమె త్తి
ఉద్వృత్త కాంగహారో[14]ద్ధతిన్ హరినొ త్తి
పాలింప కేళీవిలోలాత్మక స్ఫూర్తి
లీలఁ బడగల నిల్చి బాలతాండవమూర్తి

ఆడెనమ్మా! కృష్ణుండు
పాడెనమ్మా! విష్ణువు.

8. కుడిపాదమున భుజంగ త్రాసితచారి యొనర్చి, కుడిచేయి రేచితము, ఎడమచేయి లతాహ స్తము నుంచవలెను. చూ:-74వ పదము అధో పీఠిక. 9. ముడిచిన పాదము దాని ప్రక్కగా మోకాలుండునట్లు ఎత్తి త్ర్యశ్రముగానే తొడ మొదటి ప్రదేశము వకు త్రిప్పవలెను. 10. ఉజ్వలోన్నతపాదము. ఉజ్వలము = ప్రకాశించు - అంద ముగాఁ బైకెత్తబడిన పాదము. 11. పతాక హ స్తములతో రెండు చేతులను భుజ ములకు సమంగా ప్రక్కలకు చాచియుంచవలెను. 12. కనుబొమల కదలికచే ముడుగజేయఁబడిన కడకన్నులు. మధురము - చిఱునవ్వుతోడి మన్మథవికారో పేతమగు విలాసదృష్టి. 13. పిరుదులను పార్శ్వమును కటితోపాటు మెల్లగా పైకిలాగి యుంచినచో (ఉన్నతం చేసినచో) నది స్త్రీ లీలాగతుల యందు ప్రయుక్తము. 14 తొలుత నూపురపాదం చేసి తర్వాత రెండు చేతులు పార్శ్వ ముల వ్రేలాడగా నాపై విక్షిప్త కరణము, ఉద్వృత్తము రెండు ఒక ప్రక్కచేసి సూచి ప్రయోగించి త్రికము త్రిప్పి లతా, వృశ్చిక, కటిచ్ఛిన్నకరణములు ప్రయో గింపవలెను.

97

కనిపింపఁగా సృష్టి 'కలిక'[1] తాండవమందు
ఒనరింపఁగా స్థైర్య 'ముమా'[2] తాండవమందు
చరియింప రక్షణము 'సంధ్య'[3] తాండవమందు
హరియింప జగము 'సంహార'[4] తాండవమందు
నిజతిరోభావమ్ము 'విజయ'[5] తాండవమందు
ఓజమై మోక్షమా 'యూర్ధ్వ'[6] తాండవమందు
అందమ్ము సకల 'మానంద'[7] తాండవమందు
నందనందన 'మహానంద' తాండవమందు
అండపిండాండమ్ము మండలాకారమై
తాండవాకృతిని బ్రహ్మాండ భాండమ్మునై
ఆడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.

98

దివ్యతారంగమని దేవతారంగమని
నవ్యతారంగమని నాట్యతారంగమని
భక్తితారంగమని రక్తితారంగమని
యుక్తితారంగమని ముక్తితారంగమని

1. శివతాండవము - సప్తవిధములని శైవాగమాలు. కలిక తాండవం సృష్టికి
2. ఉమాతాండవం లేక గౌరీతాండవం స్థిరత్వమునకు.
3. సంధ్యాతాండవం పరిరక్షణమునకు.
4. సంహారతాండవం ప్రపంచలయమునకు.
5. విజయతాండవం లేక త్రిపురతాండవం తిరోభావమునకు.
6. ఊర్ధ్వతాండవం అనుగ్రహానికి, మోక్షానికి.
7. ఆనందతాండవం పై పంచక్రియలకు సమాహార రూపం. ఇందు పవ
స్పంతోషమే ఫలం. అదే మహానందం. బ్రహ్మానందం.

స్వరములు స్వనముల
పరువిడు నురుగుల

తత్తరి ఝంతరి
ఘుత్తరి ధంతరి
తకఝం తద్ధిమి
నకఝం ధిద్ధిమి
ధాకిట తకఝం
తాకిట తఝుఝం
తాం-తిధిగిణతోం
ధాం-గిధగిణతోం

జతులను నడిగొన
గతులను వడిగొన
ఎత్తుగ తిరగలు

హత్తగ జలమాలు
మద్దెల మ్రోతల
నద్దిన హద్దుల

భంగాభంగత
రంగచయాంగము
రంగోత్తుంగత
రంగిత రంగము

పాలవెల్లిపై
శ్రీలవల్లిపై
ప్రభవ మొందెనట!
అభినయించెనట!

— సిరికన్నె!—ఆ

— సిరికన్నె!



అథవాది దేవతలు ఆనందమునఁ గొలువ
అభినయోత్కర్షి తాయాస మటు విడువ
సమపాదమున నిల్చి సమశీర్ష మొకయింత
నమతమ్ము గావించి సమహస్తముల్ జతన్
గీలించి సెన్నొసటఁ గీర్తించి కళకంఠు;
చాలించి తాండవము – 'స్వస్తి' యని శ్రీకంఠుఁ
డాబాలగోపాలు నాశీస్సులన్ ముంప
'సౌభాగ్యమ' స్తనుచు సర్వమ్ము రక్షింప

నాడెనమ్మా! కృష్ణుఁడు
పాడెనమ్మా! విష్ణువు.





# గోపికాలాస్యము

## శ్రీస్తుతి

శ్రీ కల్యాణ కళాకేళీం
చిద్బిందుం సుందరాకృతిమ్,
సర్వవాఙ్మయ తత్త్వార్థాం
భజేఽహం సాత్త్విక ప్రియామ్.

ఆద్యంత రహితాం దేవీం
లాస్యవిద్యా విలాసినీమ్,
రాగతాళ సమారంభాం
నిత్యం భక్త్యా స్మరామ్యహమ్.

ప్రవిమల వచశ్శ్రీ మాధుర్యా మనోభవ జన్మభూః
మృదుపదయుగన్యాసావృత్త్యా గతిక్రమ నర్తనా,
శ్రుతిలయ సమారోహా త్సప్తస్వరాంతర చారిణీ
విలసతు జయారంభోపాస్యా రసార్ద్రి హరిప్రియా.

దివ్య నృత్యాంకితాం నవ్యభావాత్మికాం
చంచలద్భ్రూలతాం భవ్యనీలాలకామ్,
మందహాసాన్వితాం సుందరీం రాధికాం
మానసే భావయే గోపికాభిర్యుతామ్.

నట న్తి తద్ధిత్తాం తరుణత మృదంగావృత గతైః
క్వణ న్తి కింకిణ్యాశ్రిత మృదుచలన్నూపురపదైః,

లసన్తీ భావార్ద్రైః రణితవలయై రున్నతకరైః
వహన్తీ శ్రీదేవీహృది మధుహారం పాతు భువనమ్.

భ్రూక్షేప రేచిత మనోహర పక్ష్మనేత్రాం
ఉత్తుంగ కర్కశ కుచార్పిత కుంకుమార్ద్రామ్,
ఆరూఢ కంకణ రణద్రసపూర్ణ హస్తాం
తాం కింకిణీ క్వణిత రమ్యపదాం స్మరామి.

గోపాలానందమయీ
జగదాత్మమయీ నవరసశబ్దమయీ,
దివ్యజ్ఞానార్థమయీ
సదయా జననీ నివసతు మమహృదయే.

రక్తిన్ లాస్యకళావిలాసమహిమల్ రంజిల్ల బృందావనీ
భోక్తృత్వమ్ము వహించి శ్రీహరి మనః పుష్పాంతరశ్రీప్రభా
సక్తాంతర్య నటద్విశేషములు బ్రస్తావించు చిన్మూర్తిలో
భక్తిన్ దత్కరుణాకటాక్షములకై భావింతు భావమ్మునై!



# శ్రీ విలాసము

అమృతోదయమ్మట! మహానంద భరితమట!
సమృద్ధమ్ముగా జగ త్సర్వమ్ము పర్వమట!
ఆ పాలవెల్లిలో నవతరించెను కన్నె
శ్రీపతికిఁ జెలిమిన్న చెన్నొందె!—

—సిరికన్నె!

కడలి తరగలలోన కలికి కమలములలోన
పొడము రేకులలోన వెశలు తావులలోన
కలుములను వెదచల్లి కలువలను వగలెన్నె
జిలుఁగు వెలుఁగుల వెల్లి! చిన్నారి!—

—సిరికన్నె!

హెచ్చుగా నచ్చరలు మచ్చెకంటులు గొల్వ
ఉచ్చైశ్రవాదులు మహోత్సవమ్మున నిల్వ
నెలరాజుతోఁబుట్టి నిలిపె వెన్నెల చిన్నె
ఆల రత్నరాసులన్ వెలసినది!—

—సిరికన్నె!

చిలపలని చిటియలలు చెరలాడ తమ్మివిరి
తొలివిరుపు నునుసిగ్గు తులకించు వలపుసిరి
అనుభావమును గాంచి తనకుగాఁ చానెన్నె
మనసులో ముసురుకొను మరులునన్—

—సిరికన్నె!

తొగల జిలుఁగులు మీరు సొగసు కన్నులలోన
నిగనిగలు నిగుడంగ నెఱిచూపు లలముకొన
కొండమోసెడి మేటి కోరి గైకొను కన్నె
నిండుప్రేముడి మీర నిలిచె నటు—

—సిరికన్నె!

కరకంకణస్వన త్తరంగములుపొంగ
వరదేహ రోచిః ప్రభావమ్ము సాగంగ
కమఠావతారు (శ్రీ) కమలాక్షు నల్లనన్
ప్రేముడులు తొడరుకొన వీక్షించె—

—సిరికన్నె!

లలి తేక్షణా కలిత లాలిత్యభావమ్ము
మీలితాంతర లోచనాలక్ష్యహృదయమ్ము
పిచ్చలింపఁ నచ్చుపు మచ్చికల్ హెచ్చుకొని
విచ్చుకొన నిచ్చుకొనె వెన్నునకు—

—సిరికన్నె!

మందహాసమ్ములోఁ గ్రందుకొను నందమ్ము
సుందరాలంకృతీ శోభలో చందమ్ము
పద్మమందిర భాగ భవ్యనందన వనము
పద్మాక్షసౌష్ఠవ ప్రాభవము—

—సిరికన్నె!

వక్షోరుహోధ్వృత్త దక్షతన్ బ్రకటించి
లాక్షారుణప్రభా రాగమ్ము లలరించి
అక్షధరు వక్షమ్ము నధివసింపఁగ నున్న
లక్షణాపూర్ణ యహా లక్ష్మియన—

—సిరికన్నె!

మాణిక్యమకుటాగ్ర మండిత శిరోజమ్ము
వేణీ ప్రకంపనాపీడిత నితంబమ్ము
రత్న మేఖలబంధరణిత కింకిణిమధ్య
నూత్ననూపుర పాద నృత్తమున—

సిరికన్నె!

భృంగముల ఝుంకృతుల సంగీతములలోన
రంగ త్తరంగముల రమ్యవాద్యములోన
క్షీరసాగరపుత్రి శ్రీలక్ష్మి శుభగాత్రి
క్షీరసాగరశయను గీర్తించె-

—సిరికన్నె!

అమరాసురుల నడుమ నా మోహినీ రూప
మమృతమందిచ్చుచు న్నలరించు నందమ్ము
తనకింత నునుసిగ్గు తలఁపునం దలముకొన
వనజాక్షు హృదిలోన వర్తించె-

—సిరికన్నె

అల్లల్ల నుల్లమ్ము నల్లుకొను వలపునన్
మెల్ల మెల్లన హరికి సల్లలిత దృక్కులన్
ఉల్లాసముదయింప నుత్సాహమును గొన్న
ఫుల్లాంబుజాతాక్షి పుణ్యవతి-

—సిరికన్నె!

పద్మకర్ణికపీఠిఁ బద్మాసనస్థయై
పద్మనాభుని హృదయపద్మమై నిలయమై
భవ్యభాగ్యోన్నతి ప్రాప్తికిన్ మూలమై
దివ్యశోభాకృతిన్ దీపించె-

—సిరికన్నె!

హరిసమాదరణమున ననురాగ మొదలింప
సురలు హర్షింప నాగిరిశుండు దీవింప
శ్రీవత్స వక్షమున శ్రీమతిగఁ జెన్నొందె
నవనిధుల్ దన్గొలువ నలినాక్షి-

—సిరికన్నె!

పరదేవతామూర్తి పరతేజిత స్ఫూర్తి
కరుణార్ద్రి భావోక్తి కల్యాణ గుణవర్తి
విశ్వసంశ్రేయమున్ వెలయించి పాలింప
విశ్వేశ్వరీదేవి వినుతిగాను—

— సిరికన్నె!

బ్రహ్మనాథుని[1] పడతి
బ్రహ్మాండమున ప్రకృతి
పరమేశ్వరియు వేగ
పరవశమ్మున నూఁగ
కదలింప పాదమ్ము
విదలింప హస్తమ్ము
కంపింప మస్తమ్ము
ఝుంపింప వక్షమ్ము
వడిదిరుగ కక్షమ్ము
తడఁబడఁగ పక్షమ్ము
సుడివడఁగ నెన్నడుము
విడివడఁగ పెన్దురుము
కురులు ముడివడి వ్రేల
విరులు తొఁడివడిరాల
సరులు సరసరఁజార
జరితపావడ జార
చిలిపికన్నులు కులుక
వలపు వెన్నెల చిలుక
తాటంక రుచిపర్వ

గాటంపుఁ దమి నిల్వ
కంకణ క్వణనమ్ము
కింకిణీ నిక్వణము
హస్తవిన్యాసమ్ము
మస్తకోత్క్షిప్తమ్ము
పాదప్రచారమ్ము
నాదప్రసారమ్ము
నాట్యభంగిమలల్ల
పాఠ్యగీతములల్ల
సరిసరి సస్సరి
గరిగరి గగ్గరి
గమగప మమ్మగ
పమధని పప్పగ
ధనిధని ధన్నిస
సనిపని నిద్ధస
సరిసరి నిస్సరి
రిసనిసరిస్సరి

1. విష్ణువు.

స్వరములు స్వనముల
పరువిడ నురుగుల

తత్తరి ఝంతరి
ఘుత్తరి ధంతరి
తకఝం తద్ధిమి
నకఝం ధిద్ధిమి
ధాకిట తకఝం
తాకిట తఝుఝం
తాం-తిధిగిణతోం
ధాం-గిధగిణతోం

జతులను సడిగొన
గతులను నడిగొన
ఎత్తుగ తిరగలు

హత్తగ జలములు
మద్దెల మ్రోతల
నద్దిన హద్దుల

భంగాభంగత
రంగచయాంగము
రంగోత్తుంగత
రంగిత రంగము

పాలవెల్లిపై
శ్రీలవల్లియై
ప్రభవ మొందెనట!
అభినయించెనట!

— సిరికన్నె!—ఆ
— సిరికన్నె!



# రంగేళి

## 1

ఆయతమ్మున[1] నిల్చి అట్టమై[2] సవరించి
ఆయ తేక్షణ లలిత[3] నియమమ్ము నిగుడించి
అలరిప్పు[4] నలరింప హస్తయుగ్మము గూర్చి
అలయంగ డోలలో[5] నంగములు చేకూర్చి
ఆ ముద్దుగోపాలు నానందమున మ్రొక్కి
ప్రేమానురాగములు బిచ్చలింపంగ జొక్కి

1. ఇవి స్త్రీల స్థానము. ఆయతము - అవహిత్థము - అశ్వక్రాంతము - అను నవి. ఇవిగాక మఱి యైదున్నవని భరతశాస్త్రము గతాగతము - వలితము - మోటితము - వినివర్తితము - ప్రోన్నతములు. ఆయతమున కుడిపాదం సమంగా వుంచి జానెడు సందుగా చీలమండ యుండునట్లు ఎడమపాదం ఏటవాలుగా మీదికెత్తుకొని యుండవలెను. ఎద యెత్తుగ నుంచవలెను. ఉన్నతమైన పిరుదుమీద అర్ధచంద్రముగా కుడిచేయి, లతాహస్తముగ ఎడమచేయి నుంచవలెను. ఇది చక్కగా చూచుట - ప్రథమ రంగ ప్రవేశము - పుష్పాంజలి మున్నగువానియం దుపయోగము. 'యత్ర పాద స్సమ స్సవ్యః వామస్త్ర్యస్రోన్నతో భవేత్ గుల్ఫ పార్ష్ణ్యోః స్థితో మధ్యే తాలే నోరః సమున్నతం॥ ప్రసన్న ముఖరాగః స్యాత్ నిత్యంబే పాణి దున్నతే అర్ధ చంద్రో, లతాహస్తో వామః తన్మత మాయతం॥ ప్రవేశే రంగమధ్యస్య పుష్పాంజలి విమోచనే. గాంభీర్య ప్రభవే మౌనే తర్జనాదావిధం భవేత్॥' నృత్తరత్నావళి.

2. అడ్డమై - అనీ యందురు. మెడ కదలించుట - దీనికి 'సుందరీ' అనీ పేరు.

3. మధురంగా కడకన్నులు ఇంచుక ముడిచి కనుబొమలు కదలించుచు నవ్వుచు, మన్మథ వికారంతో కూడిన దృష్టి. 'భ్రూక్షేప కుంచితాపాంగా స్మితే నానంగసంభవా, వికాసేనాఽన్వితా దృష్టిః లలితా లలితాదిషు.'

4. అలారిప్పు - అలారీ - అనేది. భరత సంగ్రహంలో 'అలారీ' అనే నృత్త భేదముంది. దీన్ని పుష్పాంజలి యందురు.

5. చిఱుగాలికి కదలు తామరరేకుమీది నీటి బిందువువలె మృదువుగా అంగములు చలింపజేయుట.



ఆడినది గోపికా! – మధురముగ
పాడినది రాధికా!

## 2

### బాహ్యాంతరప్రాణ[1] భావాంగ సంచయము

1. మృదంగము - తాళములు - పిల్లనగ్రోవి - పాట - శ్రుతి - వీణ - గజ్జెలు - మంచి గాయకుడు. ఇవి పాత్ర బహిఃప్రాణములు. 'మృదంగశ్చ సుతాళౌ చ వేణుర్గీతి స్తత శ్రుతిః, ఏకవీణా కింకిణీ చ గాయకశ్చ సువిశ్రుతః, ఇత్యేవ మన్వయజ్ఞైశ్చ పాత్ర ప్రాణా బహి స్మృతాః' ఇక - పడి - నిలుకడ - సమత్వం -

బాహ్యంగ² లక్షణ ప్రయోగానుసరణము
గతి సమారోహమై యతులితానందమై
సతీమణి హృదయమై సంప్రదాయార్థమై
నృత్త సముత్సాహ⁴యత్త రంగమ్మునన్
నృత్తభేద³ కమావృత్తి సంచారమ్మునం

దాడినది గోపికా!—మధురముగ
పాడినది రాధికా!

చపలత్వం - చూపు - శ్రమము లేమి - బుద్ధి - శ్రద్ధ - మంచిమాట - పాట - ఈ పది అంతఃప్రాణాలు - జవ స్థిరత్వ రేఖా చ భ్రమరీ దృష్టి రశ్రమః, మేధా శ్రద్ధావచో గీతి స్త్వన్తః ప్రాణా దశ స్మృతాః.'

2. ఆంగికాభినయం మూడు విధాలు. అంగాభినయము - ప్రత్యంగాభినయం - ఉపాంగాభినయం. అంగములు = తల, చేతులు, చంకలు, పార్శ్వములు, నడుము, పాదములు. ప్రత్యంగాలు = మూపులు, భుజాలు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు, ఉపాంగాలు = చూపులు, రెప్పలు, నల్లగ్రుడ్లు, చెక్కిళ్ళు, ముక్కు, దౌడలు. అధరం, దంతాలు, నాలుక, గడ్డం, మొగము, శిరస్సు.

3. పాత్రమును వెన్నంటి జీవించువారి జట్టు సముదాయము. పరంపరనుబట్టి యది సంప్రదాయమైనది. ఇది యైదు విధాలు - వీనిలో విద్యావంతులు ఎనుబది నాల్గురన్న జట్టు ఉత్తమోత్తమం. అరవై నల్గురున్న జట్టు ఉత్తమం. మృదంగాది వాద్యములు మోయించువారు, గాయకులు ఇందుండురు.

4. యజ్ఞము - పెండ్లి - పట్టాభిషేకము - నగర ప్రవేశం - గృహ ప్రవేశం - జలక్రీడ - ప్రియసంగమము - వ్రతము - మహాదానం - పుత్రజననం - యాత్ర - పండుగ - పరీక్షణ - ఉత్సవం - విజయానందం - ప్రతిష్ఠ - ఇష్టార్థ సిద్ధి - దేవపూజ - ఇవి నృత్త సమయాలు.

5. పేరణి - ప్రేక్షణము - హల్లీసకం - రాసకము - సూడ - చర్చరి - ఘటిసణీ - బహురూప - శివప్రియ - చిందు - కందుక - ఖాండిక - కొల్లాట - మున్నగునవి నృత్తభేదాలు. ఇవి మార్గ - దేశభేదాలతో ప్రయోగములుగ నున్నవి.

### 3

దేశీయమగు స్థానదేశముల[1] నిలువఁగా
దేశిపాదక్రమము[2] ధీరతన్ వెలయఁగా
దేశీయచారీ[3] మహాశయమ్మొసరఁగా
దేశీయలాస్యాంగ[4] దీప్తుల న్నిలువఁగా
దేశీయ లాస్యముల్[5] దీర్చి నటియింపఁగా
దేశీయ లక్షణాదేశమ్ము దెలుపఁగా

నాడినది గోపికా!—మధురముగా
పాడినది రాధికా!

### 4

విజయోత్సవానంద విశ్వసౌభాగ్యమై
సుజనప్రియానుభవ విజయ ప్రపూర్ణమై
చతుర్విధ యోగమ్ము[6] సంధించు సమయమ్ము
చతురతల్[7] ప్రకటించు సంతోష నిలయమ్ము
మహోన్నత కళాత్మక మార్గ[8] దేశీయులు[9]

1. 'భణంతి ధరణీపాలాః ప్రాయేణాభినయ ప్రియాః అత స్తత్ప్రీతయే౽ప్యపి యద్య దుత్పాద్యతే నవమ్। నృత్తం తతః స్మృతం దేశీ తద్దేశానుసారతః' అని జాయసేనాపతి తన నృత్తరత్నావళిలోఁ బేర్కొనెను. అనగా రాజులకు క్రొంగొత్త విషయాలపై ప్రీతి గనుక, వారి ప్రీతికై క్రొత్తక్రొత్తగా ఏ నృత్తం కల్పింపబడునో అది ఆయా దేశముల ననుసరించునది దేశి. నిలువ వలసిన పద్ధతులే స్థానములు. దేశి పద్ధతిలో స్థానములు ఇరవైమూడు.

2. దేశి పాద విన్యాస పద్ధతులు పదునారు. సరికాదులు.

3. చారియన పాదచలనము. దేశి పద్ధతిలో ఇవి మూడు విధాలు. (1) భౌమి (2) ఆకాశి (3) సంకీర్ణ, ఒకేసారి భూమిపై, పైన పాదచలనంచేసి చూపవలసినవి నాల్గ.

4. మార్గ పద్ధతిలో లాస్యాంగములు పది మాత్రమే. దేశి పద్ధతిలో నలుబది యాడు. లాస్యాంగమన సుకుమారమైన అభినయం లాస్యం. ఇది తొలుత కరణ అంగ

సహితముగ లాస్యాంగ[10] సహజప్రభావములు
ఆడినది గోపికా!___మధురముగ
పాడినది రాధికా!

5

బృందావనిన్ వాద్యబృందమ్ము గొలువంగ[11]
బృందావన సారంగన్[12] దాన రాగాంగ

హారాలతో స్త్రీ లలితంగా ప్రదర్శించునదే లాస్యం. తరువాత పదార్థాభినయాత్మకమై యుండును. ఈ రెంటియందు లాస్యము ఏకహార్యమగును. ఇందు పెక్కు పాత్రలు చేరవచ్చు. అటులైన నిది పిండీబంధమగును.

5. స్త్రీ పురుషుల పరస్పర భావ విశేషమే లాసము. దానికి దగు అర్థము కలది లాస్యము. కామోల్లాసహేతువై మృదువైన అంగ విక్షేపములతోఁ గూడినది. ఇది స్త్రీలే ప్రయోగింపవలెను.

6. నాల్గువిధాలైన అభినయం నాట్యయోగమని పెద్దలందురు. ఆంగికం - వాచికం - ఆహార్యం - సాత్త్వికం - 'ఆంగికో వాచి కాహార్యౌ సాత్త్విక శ్చేత్యసౌ పునః, చతుర్ధా కలితో యత్ర సర్వం నాట్య ప్రతిష్ఠితం' నృ.ర.

7. చతుర్విధాభినయంలో చాతుర్యం ప్రదర్శించుట.

8. భావము నాశ్రయించినది పదార్థముల నభినయించునదగు స్వరూపము గలది - నృత్యము. కాన ఇది శాస్త్రీయమై లక్షణానుగతమైనది. నాట్యవేదమునుండి వెడలినది, మహర్షులు కనుగొనినది, సజ్జనుల ప్రచారము చేసినది. కావున నృత్యం, నృత్త, నాట్యము, - 'మార్గము' అను భేదమయ్యెను.

9. నాట్యములో అభినయంలో ఏప్పడే రీ పాలను కప్పిపుచ్చుకొనేది, ఆయా దేశ ప్రజల అభీష్టానుసారమగా నేర్పడినది - 'దేశి'

10. చూ:— గోపికాలాస్యం 3వ పదము అధోపీఠిక.

11. నాట్యమునకు ముందుగా వాద్యములు ప్రయోగించుట చూ:—కృష్ణ తాండవం 15వ పదము అధోపీఠిక.

12. ఇది ఖరహర ప్రియ జన్యరాగము-'సరిమ పనిస-సనిప మగరిస' అనేవి స్వరాలు ఆరోహణంలో చతుశ్రుతిఋషభం, శుద్ధమధ్యమం, చతుశ్రుతిధైవతం, కైశిక నిషాదం - అవరోహణంలో సాధారణ గాంధారము ఎక్కువగా వచ్చును.

సంప్రదాయము నించి సాగించి స్వచ్ఛతన్
ఉంఫితగమకముల[13] న్నాలికించి కచ్ఛపిన్[14]
మేళవించిన వాణి మేలమాడఁగ మెచ్చి
హాళిమై కృష్ణునకు నంజలిన్ జేకూర్చి
ఆడినది గోపికా!—మధురముగ
పాడినది రాధికా!

## 6

కుటిల కుంతల ఫాల ఘటిత సీమంతమ్ము
నటిత రత్నప్రభా చటుల తరలాంతమ్ము
కేతకీ రేఖాగ్ర కేశబంధ విధమ్ము
నితత పుష్పవిలాస విన్యాస గంధమ్ము
చలిత స్ఫిగంతర[1] స్వర్ణ గుచ్ఛాగ్రమ్ము[2]
వలిత వేణీక్రమము వర్తింపఁగాఁ జిమ్ము[3]

13. రాగాలాపమునందు తుమ్మెద ఝుంకారమువలె స్వర గమక మొనర్చుట లేక మూర్ఛన మొనర్చుట.

14. సరస్వతీదేవి వీణ.

1. చలింపఁబడు యెత్తయిన పిరుదుల భాగము. 'స్ఫిచౌ కటి ప్రోథా' అని నిఘంటువు. 2. బంగరు కుచ్చుల కొనలు.

3. జడను తెరపయి చిమ్మివేయుట - కూచిపూడి నృత్యంలో భామ కలాప మనేది ఒక నృత్య కళాఖండం. అందు 'జడపట్టు' (జటాకలాపం) విధానం ముఖ్యం. నాయిక (భామ) రంగస్థల ప్రవేశానికి ముందు ఈ జడపట్టు విధానం ప్రదర్శించవలెను. జడను తెరపై జిమ్మివేయవలెను. తనకు (నటునికి) సకల శాస్త్ర పాండిత్యమున్నదని, సభలో విద్వాంసులున్నచో తన్ను పరీక్షింపవచ్చునని సవాలు చేయుట. విద్వాంసులు పరీక్షించిన మీదట పాత్రధారి ఓడిపోయినచో ఆ జడ కత్తిరించి వేయవలెను.



ఆడినది గోపికా!——మధురముగ
పాడినది రాధికా!

**7**

బ్రహ్మాండ భాండమున బ్రహ్మమడఁగిన లీల
బ్రహ్మాది దేవతలు పరముఁ గనుగొను లీల

క్రాంతదర్శన[1] భావకాంతి కిరణము లీల
చింతనామృతపాన చిత్తాంతరము లీల
గోపగోపీ హృదయ గోప్యమ్ము గను లీల
శ్రీపతీ హృదయమునఁ జెల్వొందు సిరిలీల

నాడినది గోపికా!—మధురముగ
పాడినది రాధికా!

8

అలకలన్ బులకించి యాణిముత్తెములూరి
నిలిచెనన్ జెన్నునన్ నెన్నుదిటిపై జారి
తిలకమ్ము తిన్నఁగాఁ దీర్చి రక్తిమ గూరి
పొలుపుగా ముక్కెరన్ బొందుగైకొని మీరి
వలుదపాలిండ్లపై ఘట్టుమని ప్రిదిలిపడ
నులివడుచుఁ జెమ్మటలు నూఁగారుపై నాడ

నాడినది గోపికా!—మధురముగ
పాడినది రాధికా!

9

చెంగావి పావడన్ జెన్నొందు కటిబిగువు
రంగారు కుచ్చెళ్ళహంగు పొంగుల హారువు
బంగారుపేటులన్ బరివృతమ్మగు వెలుఁగు
చంగుచంగున నడక లంగుగా నిడు నడుగు

1. ఇంద్రియాతీత విషయ పరిజ్ఞానమున సూక్ష్మపరిశీలనము చేయుట.

గిలుకుమెట్టెల రవళి వలికించి కులికించి
విలంబిత గతి[1] మీర వేడుకల్ బచరించి

ఆడినది గోపికా——మధురముగ
పాడినది రాధికా!

## 10

దర్పసరణమ్మునన్[2] దర్పమ్ము చూపించి
కూర్పరమ్ములు[3] ముడిచి కుంచితమ్ముగ[4] నుంచి
బాహుప్రకారమ్ము ప్రకటింప దశకమ్ము[5]
బాహువుల్ విదలించి పక్షవంచిత విధము[6]

1. నర్తనము (గతి - నడక) ద్రుతము - మధ్యము - విలంబితము అని మూడు విధాలు. ఇవి ఒకదానిలో నొకటి కలిసి సంకీర్ణములగును. తాళముల (జానల) దీర్ఘము, అల్పము, అను కాలములన్నింట నీ మూడు విధాలుండును. 'నర్తనే గతి యస్త్రిస్రో ద్రుత మధ్య విలంబితాః॥ దీర్ఘాల్ప తాల కాలేషు సంభవ త్యధిలేష్వపి' నృ. ర. ఒక జానెడు (తాళము) దూరమునకు రెండు జానల కొకసారి అడుగువేయుట విలంబితము.

2. ఇది వైష్ణవ స్థానము. (ఒక పాదం సమంగా వుంచి రెండవ పాదం కొంచెం ముడిచి అడ్డంగా ముందుకు సాగుట) అందుండి ఒక పాదము ప్రక్కకు త్రిప్పి అవైపున అడ్డముగా చక్రమువలె దేహము త్రిప్పి ముగింపున మఱొక పాదము త్ర్యశ్యముగా నున్నచోట చేర్చుట.

3. మోచేతులు - మోకాళ్ళు.

4. సమ - అగ్రతల సంచార - కుంచిత - ఉద్ఘట్టిత - అంచిత - అను పాద లక్షణము లందలిది. కుంచితమున - మడమ మీదికెత్తి వ్రేళ్ళను నడిమి భాగమును, వంచించునది. ఈ పాద లక్షణాలను కొందరు పదిభేదాలుగా సూచించారు.

5. పది విధాలైన బాహు ప్రకారాలు. ఊర్ధ్వగత - పృష్ఠగత - తిర్యగ్గత - స్వస్తిక - మంగల - అసవిద్ధ - అంచిత - ఆవిద్ధ - కుంచిత - అధోముఖ మనేవి.

6. రెండు త్రిపతాక హస్తములు ముందుగా నడుము మీదికి ఎగబట్టినది. 'వినస్యాగ్రే కటి శీర్షే త్రిపతాక కరౌ యది - పక్షవంచిత నామానౌ అనయో ర్దేవత

హస్తముల హృదయమ్ము హరి దెలిసి వలపింప
ప్రస్తావనోచితము వర్తనలు[7] వివరింప
నాడినది గోపికా! — మధురముగ
పాడినది రాధికా!

## 11

దశావస్థాక్రమము[1] దర్శనీయమ్ము భా
వశబలత[2] మహీయమ్ము వర్ణనీయమ్ము భా

యోర్ధ్వన' - ఇందుకు వినియోగము 'ఊర్ధ్వోరభినయే భేదే వినియోగో నియుజ్యతే' అభి. ద. కాపీ. దీనినే నృత్తరత్నావళీకారుడు మరో విధంగా సూచించాడు. 'త్రిపతాకా కటీ మూర్ధ్ని దత్తాగ్రా పక్షవంచితా' అనగా ఒక త్రిపతాకం కటిని, ఇంకొకటి శిరమును కొనలతో తాకిన పక్షవంచిత మన్నాడు.

7. మృదంగాది వాద్యములు మ్రోయించుటలోని హస్తలక్షణములలోవిది. కర్తరి - సమహస్తం - హస్తపాణిత్రయం - వర్తన దండహస్తం అనేవి. వర్తనలో మొదట కుడిచేతను, పిమ్మట ఎడమచేతను నాల్గు ప్రపాతములు చేయుట (ప్రహారములు ఇందుకు సంగీత రత్నాకరంలో - 7వ అధ్యాయం 'బహూనాం కరణానాథ సమస్తవ్యస్త యోజనాత్ క్రమద్ధృతాది వైచిత్ర్యాజ్ఞాయన్తేఽత్ర సహస్రశః' ॥348॥ - 'వర్తనాశ్చతురై రూహ్యాస్తాః శోభాకర సంభృతా తే రేఖా మనతిక్రమ్య భూరి భంగి భృతో భుజః ॥349॥ - 'రేచ్యన్తే యది లక్ష్యజ్ఞై ర్వాలకాః కీర్తితా స్తదా' - వర్తనలు ఇరువదినాల్గు - పతాక, అరాళ, శుకతుండ - అలపద్మ - కటకా ముఖ - మకర - ఊర్ధ్వ - అవిద్ధ - రేచిత - నితంబ - కేశబంధ - పాల వర్తనిక - (చక్రవర్తినిక) కక్షవర్తనిక - ఉరోవర్తనిక - ఖడగసర్తనిక పద్మ, దండ, పల్లవ, అర్థమండల, ఘాత (ధాత) వర్తనిక - లలిత - వలితగాత్ర ప్రతివర్తనా - అనేవి - మఱియు అంగరచన (మేకప్) MAKE-UP: పురుషుడు స్త్రీ రూపము - స్త్రీ పురుషరూపము వేయుటలో (పాత్రధారణ చేయుటతో తమ రూపమును మఱుగుపరచుకొనుటను 'వర్తన'మని - అనగా స్వవేషపరివర్తితమైన రూపము, నానా వర్ణసంయోగ సంశ్రయవిధి ఇందు కలదు.

1. ఇవి నాయిక శృంగారావస్థలు, చక్షుప్రీతి - చింత సంస్మృతి - గుణకీర్తన - అరతి - తాపము - లజ్జాత్యాగము - గమనము - మూర్ఛ - ధన్యత -

2. రసపదలంకారములలో నొకటి - భావశాంతి (భావమడగుట) భావోదయం (భావం పుట్టుట) భావసంధి (భావమడుగుట పుట్టుటలో ద్వైవిధ్యము) భావ

